

# చందమామ

మే 1997






విడిప్రతి : **6.00**

సంవత్సర చందా : **72.00**

అందము యొక్క
సంప్రదాయం!

# మెరి

కదల్చబడని
నమ్మిక!!

# గోల్డ్ కవరింగ్ నగలు

వ్యక్తిగత అలంకారమునకు సృష్టించబడి, శిల్పకళకు మరియు శ్రేష్టమైన డిజైన్లకు గొప్పగా మదించబడినది. మెరి - గత 35 సం॥ గా గోల్డ్ కవరింగ్ నగల ఉత్పత్తిలో ఉన్న ప్రసిద్ధ వర్తక సంస్థ. క్రింద ప్రదర్శించబడిన ఈ కొన్ని డిజైన్లు వి.పి.పి. ద్వారా పొందగలరు. నగల యొక్క కోడ్ నంబర్ రాసి మీరు కోరుకొనినది పొందవచ్చును. వి.పి.పి. రుసుము ఉచితం. మరియు 150 పేజీలు గల ఉచిత అందమైన జాబితా కై వ్రాయండి.

B1282 Rs.157

B1281 Rs.181

B1356 Rs.115

A701 Rs.175 1/4 Gram

C2376 Rs.59

A723 Rs.350 1/4 Gram

C2031 Rs.99

A712 Rs.175 1/4 Gram

B1236 Rs.87

A43 Rs.50

A468 Rs.100

C2159 Rs.63

B1572 Rs.33

A337 Rs.100

B1294 Rs.79

C2170 Rs.33

A1344 Rs.58

A393 Rs.100

A20 Rs.50

B1823 Rs.33

A110 Rs.50

C2314 Rs.54

A37 Rs.50

A138 Rs.50

A21 Rs.50

A184 Rs.50

B1963 Rs.78

B1658 Rs.60

C2107 Rs.73

C2810 Rs.50

C2809 Rs.50

C2192 Rs.51

A26 Rs.100

B1546 Rs.63

**MERI GOLD COVERING WORKS**

Post Box : 1405, 18, Ranganathan Street, T. Nagar,
Chennai 600 017. Phone : 4344671, 4342513

MGC/17/97

## PolioPlus



# IMMUNIZATION AN ASSURANCE OF GOOD HEALTH TO CHILDREN

## VACCINATIONS When and How Many

| Age to Start Vaccination | Name of Vaccine | Name of Disease | How Many Times |
|---|---|---|---|
| Birth | **BCG** | **Tuberculosis** | Once |
| 6 weeks | **Polio** | **Polio** | Three times with intervals of at least one month |
| 6 weeks | **DPT** | **Diphtheria Pertussis (Whooping Cough) Tetanus** | Three times with intervals of at least one month |
| 9 months | **Measles** | **Measles** | Once |

**Babies should receive all vaccinations by the time they are twelve months old.**

Pregnant women should get themselves vaccinated against Tetanus (TT) twice—in an interval of at least one month—during the later stages of pregnancy.

**HEALTHY CHILD—NATION'S HOPE & PRIDE**

Design courtesy : World Health Organisation




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'   సంచాలకుడు : నాగిరెడ్డి

## స్వయం ఉపాధి!

మేనెల రాగానే పరీక్షలు ముగిసి – పుస్తకాలు, పాఠాలు అనే బరువులు తగ్గి విశ్రాంతి, విరామం అంటూ హాయిగా రోజులు గడిపే సెలవులు ఆరంభమవుతాయి. అయితే, ఇటీవలికాలంలో వేసవి సెలవులను సంతోషంగా గడిపే పరిస్థితి కనుమరుగవు తున్నది. ఎందుకంటే పాఠశాల చదువు పూర్తికాగానే కళాశాలకు వెళ్ళాలి. కళాశాలలో సీటు లభించడం అంత సులభంకాదు. పెరుగుతూన్న విద్యార్థుల సంఖ్యకు అనుగుణంగా కళాశాలల సంఖ్య పెరగకపోవడమే దీనికి ముఖ్య కారణం. వైద్యం, ఇంజనీరింగ్, కంప్యూటర్ వంటి వృత్తి విద్యాసంస్థలు శాఖోప శాఖలుగా విస్తరిస్తున్నాయి. అయినా, వాటిలో సీటు సంపాయిం చడం అందరికీ సాధ్యమయ్యేపనికాదు. అది ఒక పోటీ ప్రపంచం. పైచదువులు చదివే అవకాశం లేని వారు ఉద్యోగా న్వేషణలో పడతారు.

ఇవాళ ప్రభుత్వ రంగంలో గానీ, ప్రైవేటు రంగంలో గానీ అందరికీ ఉద్యోగాలు లభించడం అసాధ్యం. కాబట్టి ఉద్యోగం కోసం ప్రభుత్వం మీదా, ప్రైవేటు సంస్థల మీదా ఆధారపడకుండా స్వయంగా ఉపాధి కల్పించుకోవడం మంచిది. సొంతంగా ఉపాధి కల్పించుకుని, అందులో నిలదొక్కుకుని, పదిమందికి ఉపాధి కల్పించడం అంత సులభమైన పనికాదు. అదిఎంతో శ్రమతో కూడుకున్న పని. అయినా, ప్రస్తుత పరిస్థితిలో అదే ఉత్తమంగా కనిపిస్తున్నది. ఈ అవసరాన్ని గుర్తించే ప్రభుత్వం కూడా స్వయంఉపాధి కల్పనకు కావలసిన సహాయ సహకా రాలు అందజేస్తున్నది. ఇది అభినందనీయమైన విషయం.

సంపుటి : **100**   మే '**97**   సంచిక: **5**
విడిప్రతి : **6.00**   సంవత్సర చందా :   **72.00**




चन्दामामा
चांदोबा
చందమామ
CHANDAMAMA

## వార్తలు - విశేషాలు:

# రష్యా-బెలారస్ సమైక్యత

మే 20వ తేదీ రష్యా, బెలారస్ ఒక ఫెడరేషన్‌గా మళ్ళీ ఏకం కానున్నాయి. ఐదేళ్ళ క్రితం సోవియట్ యూనియన్ పతనంతో 15 రిపబ్లిక్కులు విడిపోయాయి. అప్పుడు అక్కడి ప్రజలు స్వతంత్రం పొందామని పొంగిపోయారు. కాని ఆ సంతోషం ఎంతోకాలం కొనసాగలేదు.

1991వ సం॥లో సోవియట్ యూనియన్ ఛిన్నా భిన్నం కావడం ఆయా రిపబ్లిక్కుల ఆర్థిక విచ్ఛిత్తికి దారితీసింది. ధరలు అనూహ్యంగా పెరిగి పోయాయి. ఆఖరికి కొన్ని రాష్ట్రాలలో రొట్టెముక్కలకోసం గంటల తరబడి వరుసలలో నిలబడవలసిన దుర్భరపరిస్థితి ఏర్పడింది. సోవియట్ యూనియన్‌తో కలిసి, కమ్యూనిస్టు పాలనకింద ఉన్నప్పుడే తమరోజులు సుఖంగా ఉన్నట్టు చాలామందికి అనిపించింది. మళ్ళీ రష్యాతో కలవడం మంచిదన్న ఆలోచన కలిగింది!

రష్యా, బెలారస్ (తెల్లరష్యా) అనే బైలో రష్యా మధ్య పెద్ద భేదా లేవీ లేవు. ఉభయ ప్రాంతాల వారి మాతృభాష రష్యన్. ఉన్నతమైన విద్యాప్రమాణాలకూ, సాంకేతిక అభివృద్ధికీ బెలారస్ పేరుగాంచింది. అందువల్ల ఆనాటి సోవియట్ యూనియన్ ప్రణాళికా విభాగం - - బెలారస్‌లో ఎలక్ట్రానిక్స్, మెషీన్ బిల్డింగ్, పెట్రో కెమికల్స్, ఆహారం మొదలైన వాటికి సంబంధించిన పరిశ్రమలను అక్కడ నెలకొల్పింది. వాటికి కావలసిన ముడిపదార్థాలను రష్యా నుంచి సరఫరా చేసేవారు. పైగా బెలారస్ కీలకమైన స్థానంలో ఉండడంవల్ల, సోవియట్ యూనియన్ దానిని యూరపు దేశాలకు తమ వస్తువులను ఎగుమతి చేసే కేంద్రంగా అభివృద్ధి పరిచింది.

వెనుకటి పరిస్థితి మళ్ళీ ఏర్పడాలంటే, రెండు రిపబ్లిక్కులూ ఒకటిగా ఏకం కావడం అవసరం అని ఉభయులూ ఆలోచించడంలో ఆశ్చర్యం లేదు. మరొక విషయం ఏమంటే సోవియట్ యూనియన్ విచ్ఛిత్తి తరవాత జరిగిన ఎన్నికలలో బోరిస్ ఎల్‌స్టిన్ ప్రెసిడెంటుగా ఎన్నిక కావడానికి బెలారస్ కొంతవరకు సాయపడింది.

1996వ సం॥ ఆరంభంలో వివిధ రంగాలలో పరస్పర సహకారం కోరే ఒప్పందంలో ఉభయ దేశాలు సంతకాలు చేశాయి. ఏప్రిల్ 2వ తేదీ ఫెడరేషన్ ఏర్పడడానికి కావలసిన యూనియన్ ట్రీటీలో సంతకాలు జరిగాయి. రష్యా ప్రెసిడెంట్ ఎల్‌స్టిన్, బెలారస్ ప్రెసిడెంట్ లుకషెంకో మే 20వ తేదీ ఈ ఒప్పందంలో సంతకాలు చేయనున్నారు. ఆ తరవాత ఉభయ దేశాల పార్లమెంటులు ఆ ఒప్పందాన్ని ఆమోదించి ధృవపరచాలి.

ఈ రెండు దేశాల ఫెడరేషన్ ఏర్పడడం వల్ల రష్యాకే ఎక్కువ ప్రయోజనకరమని బెలారస్‌లో కొంత విమర్శ బయలుదేరింది. రాజధాని మిన్‌స్క్‌లో వ్యతిరేక ఆందోళనలు కూడా తలెత్తాయి. అయితే, ప్రెసిడెంట్ లుకషెంకో ఈ విషయంగా ప్రజలమధ్య 'రెఫరెండం' పెట్టి, రష్యాతో ఏకం కావడానికి మెజారిటీ ప్రజల మద్దతు పొందాడు.

గతంలో విడిపోయిన మిగిలిన రాష్ట్రాలు కూడా ఈ ఫెడరేషన్‌లో చేరడానికి ముందుకు వస్తాయేమో వేచిచూడాలి!






# సుబ్బారాయుడి గుండెజబ్బు

నాగాపురం జమీందారు కొలువులో, సుబ్బా రాయుడనే పండితుడున్నాడు. సంస్థానానికి వచ్చిన కవుల కవిత్వంలోని తప్పొప్పుల నెంచడం ఆయన పని. జమీందారుకు సుబ్బారాయుడి పాండిత్యం మీద చెప్పలే నంత గురి. అందువల్ల ఏ కవి అయినా ముందుగా సుబ్బారాయుడి మెప్పు పొంద వలసి వచ్చేది.

సుబ్బారాయుడు లంచగొండి కాదు కానీ తనకు లభించిన పదవి అతడిలో అహంకా రాన్ని పెంచింది. చూడవచ్చిన కవులను హేళన చేసేవాడు. తనంతటి వాడు లేడన్నట్లు మాట్లాడేవాడు. తన మాటకు ఎదురు చెప్ప డాన్ని ఏమాత్రమూ సహించలేకపోయేవాడు. తను చెప్పిన ప్రతిమాటకూ తలూపే వాళ్ళనీ, జమీందారుకు అత్యంత సన్నిహితులైన వాళ్ళనీ మినహాయించి, తక్కిన వాళ్ళను హీనంగా చూసేవాడు.

జమీందారు ఎంతో మంచివాడు. ఆయ నలో గర్వం, అహంకారం రెండూ లేవు. అయితే, ఆయనకు ఎవరిని గురించీ చెడు వినడం ఇష్టముండదు. చెడు చెప్పే వాళ్ళ నాయన తనదరిదాపులకు రానివ్వడు. అందు వల్ల సుబ్బారాయుడి అహంకారం గురించి ఆయనకు తెలియకుండాపోయింది.

ఇలావుండగా – జమీందారు ఒకరోజున బండిమీద పొరుగూరుకు బయల్దేరాడు. దారిలో బండిచక్రం పాడైంది. బండివాడు బండిని బాటపక్కకు చేర్చి, జమీందారుతో, "అయ్యా! ఈ పక్కన మామిడితోటవున్నది. తమరక్కడ విశ్రాంతి తీసుకోండి. బండి బాగుపడ్డాక, నేను వచ్చి పిలుస్తాను," అంటూ మరమ్మతు మొదలుపెట్టాడు.

జమీందారు మామిడితోటలోకి వెళ్ళేసరికి, అక్కడ ఒక చెట్టుకింద కొందరు గుమిగూడి వుండడం కనబడింది. దగ్గరకు వెళ్ళి చూస్తే,

"వసుంధర"

ఒకతను శ్రావ్యంగా పద్యాలు చదువుతూ, తన చుట్టూ వున్నవారికి ఒక్కొక్క పద్యాన్ని విడమర్చి అర్థం చెబుతున్నాడు. జమీందారు తనూ ఆ గుంపులోచేరి మంత్రముగ్ధుడై ఆ పద్యాలు విన్నాడు.

కాసేపటికి పద్యాలుచదివే అతను తక్కిన వారితో, "ఈ రోజుకిది చాలు. మళ్ళీ రేపు కలుద్దాం. లేని పక్షంలో తోటకాపలా కిబ్బంది వస్తుంది. మీరికవెళ్ళి మీమీ పనులు చూసు కోండి," అన్నాడు.

అందరూ వెళ్ళిన తర్వాత జమీందారు, అతణ్ణి వివరాలడిగాడు.

అతడి పేరు గోవిందుడు. తను రాసిన కావ్యాన్ని నాగాపురం జమీందారుకు వినిపిం చాలని వెళితే, సుబ్బారాయుడు సాగనివ్వ లేదు. వేరే బ్రతుకుతెరువు లేక అతడిక్కడ తోటకాపలాపనికి కుదిరాడు. రోజూ కాసేపు తన కావ్యాన్ని పొలంపనులుచేసేవారికి విని పించి అర్థం చెబుతూంటాడు.

"ఇలా చేయడంవల్ల నీకేం ప్రయోజనం?" అని అడిగాడు జమీందారు.

"నా కావ్యాన్ని పదిమందీ విని ఆనందిస్తే, నాకెంతో తృప్తిగా వుంటుంది," అన్నాడు గోవిందుడు.

"శ్రోతలను బట్టి కావ్యం విలువ పెరుగు తుంది. నాగాపురం జమీందారుకు నీ కావ్యం వినిపించడానికి గట్టి ప్రయత్నం చేయకపో వడం నీ తప్పు," అన్నాడు జమీందారు.

"ఆ జమీందారు కంటే, ఈ శ్రోతలే నాకు గొప్పవాళ్ళు. కవిత్వం విని ఆనందించ డానికి వీళ్ళకు సుబ్బారాయుడి అడ్డులేదు. ఒక్కసారితో ఆగక ప్రతిరోజూ అడిగి నా



కావ్యం వింటున్నారు. నాకై నేను ఆపాలి తప్ప వాళ్ళు వద్దనరు. అదే నాకు తృప్తి!" అన్నాడు గోవిందుడు.

అప్పుడు జమీందారు, గోవిందుడికి తానెవరైనదీ చెప్పి, "సుబ్బారాయుడు గొప్ప పండితుడు. నీ విషయంలో ఎక్కడోపొరబాటు జరిగింది. నువ్వు మా సంస్థానానికి వచ్చి,నా సత్కారాన్నందుకోవాలని నా కోరిక," అన్నాడు.

తనతో మాట్లాడుతున్నది నాగాపురం జమీందారేనని తెలిశాక గోవిందుడు నొచ్చు కుని, "తెలియక నేనేదైనా పొరపాటు మాట అని వుంటే మన్నించండి. తమ సంస్థానానికి మాత్రంసుబ్బారాయుడి అడ్డువుండగా రావడం నావల్ల కాదు," అన్నాడు.

జమీందారు తన ఉంగరాన్ని గోవిందుడి కిచ్చి, "ఇది చూపిస్తే సరాసరి నా దగ్గరకు



రావచ్చు. ఈరోజుపంచమి. దశమినాటికినేను నీ కోసం ఎదురుచూస్తుంటాను," అన్నాడు.

గోవిందుడాయనకు వినయంగా నమస్కరించాడు.అంతలో బండివాడు వచ్చి జమీందారును పిలుచుకుని వెళ్ళాడు.

ఆ తర్వాత దశమినాటికి గోవిందుడు, జమీందారు దర్శనం చేసుకుని నిండుసభలో తన కావ్యపఠనం చేశాడు. జమీందారు ఎంతో సంతోషించి తన దివానుతో గోవిందుడికి వెయ్యి బంగారు కాసులివ్వమని చెప్పాడు.

అప్పుడు సుబ్బారాయుడు కలగజేసుకుని, "ప్రభూ! ఈ సభలో సన్మానార్హతను నిర్ణయించవలసిన వాడిని నేను. ఈ కవి సన్మానార్హుడుకాడు. ఇది నా నిర్ణయం," అన్నాడు.

"ఎన్నోసార్లు నీ నిర్ణయాన్ని గౌరవించాను. ఒక్క సారికి నువ్వూ, నా నిర్ణయాన్ని గౌరవించాలి," అన్నాడు జమీందారు చిన్నగా నవ్వుతూ.

"ప్రభూ!అర్హతలున్నవారి నిర్ణయాన్ని నేనెప్పుడూగౌరవిస్తాను.కవి సన్మానార్హతను నిర్ణయించగలవారు నేను తప్ప, ఈ సభలో ఇంకెవ్వరూవున్నారనుకోను," అన్నాడు సుబ్బారాయుడు.

జమీందారు ముఖం ఎర్రబడింది. ఆయన అతికష్టం మీద తమాయించుకుని, "అర్హత సంగతి తెలియదు కానీ, నాకు సన్మానార్హతను నిర్ణయించగల అధికారముంది!" అని, "దివానుగారూ! నేను చెప్పిన విధంగా కవి సన్మానం జరిపించండి," అన్నాడు.

సుబ్బారాయుడిక ఆగ్రహం పట్టలేక, "తమకు అధికారముందని అహంకరిస్తే కీడు తప్పదు. పండితుడిగా హెచ్చరిస్తున్నాను. నా మాట విని ఈ సన్మానాన్ని ఆపండి. లేదా నేనిక మీదట ఏ కవికీ తప్పొప్పులు ఎంచే బాధ్యత తీసుకోను," అన్నాడు.

"ఎదుటివాడి అహంకారం గురించి మాట్లాడే ముందు, నీ అహంకారం గురించి ఆలోచించుకో. పండితుడికి అహంకారం కూడదు.ఇదినీకు నాహెచ్చరిక!" అని జమీందారు, దివానుకు మరొకసారి చెప్పి గోవిందుడికి సత్కారం జరిపించాడు.

సుబ్బారాయుడికిది భరించరాని అవమానమయింది. ఇల్లుచేరాక భార్యకు జరిగింది చెప్పి, జమీందారు మీద భగ్గుమన్నాడు. ఆమె భర్తను అనునయించి, "ఆవేశంలో మీ స్థానాన్ని మీరు మర్చిపోవద్దు. వారు

ప్రభువులు. వారి నిర్ణయాన్ని గౌరవించక పోతే మనకు మనుగడ వుండదు," అన్నది.

ఆ సమయంలో గోవిందుడు అక్కడకు వచ్చి, "అయ్యా! నా కారణంగా తమరు ప్రభువులతో గొడవపడినందుకు విచారంగా వున్నది. ఇందులో నా ప్రమేయం ఏమీలేదు. అంతా అనుకోకుండా జరిగిపోయింది. నాకు తమరంటే గౌరవభావమున్నది. నా కవిత్వం సన్మానార్హం ఎందుకు కాదో తెలియబరిస్తే నా లోపాన్ని సవరించుకుందామని ఇలా వచ్చాను. మీరు చెప్పగలిగినదిప్పుడు చెప్ప వచ్చు," అన్నాడు వినయంగా.

సుబ్బారాయుడు ఆవేశపడిపోతూ, "రాజ సన్మానం పొందాక నాతో నీకేం పని? నీవు నన్ను అవహేళన చేయడానికి వచ్చినట్లు నాకు తెలిసిపోయింది. తక్షణం ఇక్కణ్ణించి వెళ్ళిపో," అని అరిచాడు.

"ఒక కవితో మాట్లాడే పద్ధతి ఇదా?నువ్వు పండితుడివి కాదు. అహంకారివి. నీ అహం కారానికి ఫలితం తప్పక అనుభవిస్తావు," అని గోవిందుడక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

సుబ్బారాయుడు మరింత ఆవేశపడి చాలాసేపటివరకూ, గోవిందుణ్ణి తిట్టుకుం టూనేవున్నాడు.అలాతిడుతూ, తిడుతూ ఉన్న ట్టుండి గుండెలో నొప్పిపుట్టి, ఉన్నవాడున్నట్లు కూలిపోయాడు.అతడి భార్య కంగారుపడి, వెంటనే వైద్యుడికి కబురుపెట్టి రప్పించింది.

వైద్యుడు, సుబ్బారాయుణ్ణి పరీక్షించి, "ఇది తీవ్రమైన గుండెజబ్బు. యోగాపురం లోని సనాతనుడనే వైద్యుడొక్కడే దీనికిచికిత్స చేయగలడు.కానీ ఆయన రాజులకూ, జమీం దార్లకూ తప్ప వైద్యం చేయడు," అన్నాడు.



ఈ విషయం జమీందారుకు తెలిసి, వెంటనే సుబ్బారాయుణ్ణి యోగాపురం పంపి, సనాతనుడి వద్ద అన్ని ఏర్పాట్లూ చేయించాడు. సనాతనుడు అతణ్ణి ఎన్నో విధాలుగా పరీక్షిం చాక, "ఈ జబ్బు మానసిక కారణాలవల్ల వచ్చింది. అసలైనకారణంతెలిస్తే తప్ప శాశ్వ తంగా నయంకాదు," అన్నాడు.

అప్పుడు సుబ్బారాయుడు, సనాతనుడికి జరిగింది చెప్పి – జమీందారు, గోవిందుడు చూపిన అహంకారమే, తనను మానసికంగా కృంగదీసిందన్నాడు.

"జమీందారు నీ కిక్కడ వైద్యసదుపా యాలుచేయించాడు. గోవిందుడు తన తప్పొ ప్పులు చెప్పమని సన్మానం పొందిన తర్వాత కూడానిన్నడిగాడు. ఒకరు దయాశీలి. ఇంకొ కరు వినయశీలి. వారిద్దరిలో తప్పు లెంచడం



నీ అహంకారం. ముందు నీవది చంపుకోవాలి. లేకుంటే నీ జబ్బు నయంకాదు," అన్నాడు సనాతనుడు.

దీనికి సుబ్బారాయుడువిసుగ్గా, "నేను మహాపండితుణ్ణి. అహంకారానికీ, ఆత్మగౌర వానికీవున్న తేడా నాకుతెలుసు; మీకు తెలి యదు. అందువల్లనే ఇలా అంటున్నారు," అన్నాడు.

సనాతనుడు నవ్వి, "నిజమే! నేను వైద్యుణ్ణే కానీ పండితుణ్ణి కాను. అయితే నీ జబ్బుకు అసలుకారణం తెలియకుండా వైద్యం కొనసాగించలేను. జమీందారులో, గోవిందుడిలో నాకు తప్పు తోచలేదు. నా శిష్యుణ్ణి నాగాపురం పంపించి వాకబుచేస్తాను. నీ గుండెజబ్బుకు కారణం అక్కడ వుంటే తప్పక తెలుస్తుంది," అన్నాడు.

సనాతనుడి శిష్యుడు నాగాపురం వెళ్ళి, సుబ్బారాయుడిగుండె జబ్బు గురించి వాకబు చేశాడు. ఒక పెద్దమనిషి అతడితో, "సుబ్బా రాయుడికి గుండెజబ్బు రాకేం చేస్తుందీ? కొడుకు చెప్పిన మాటవినడు. తనకు తోచిందే చేస్తాడు. ఇద్దరూ గొడవపడని రోజంటూ వుండదుకదా! చివరికతను, కొడుకును ఇంట్లోంచిపొమ్మన్నాడు. వాడు వెళ్ళిపోయాడు. అందుకే వచ్చింది గుండె జబ్బు," అన్నాడు.

మరొక పెద్దమనిషి, "నాకు అసలు కారణం తెలుసు. సుబ్బారాయుడి పొరుగునే వీర్రాజనే అతనువుంటున్నాడు. ఇద్దరి పెరళ్ళ కీమధ్య ఉమ్మడి గోడవుంది. దాన్ని గురించి రోజూ ఇద్దరికీ పెద్ద రభస! ఆ గొడవతో అతడికి గుండెజబ్బు వచ్చింది," అన్నాడు.

"వీర్రాజు ఎలాంటివాడు?" అని అడిగాడు శిష్యుడు.

"ఒక్క సుబ్బారాయుడితో తప్ప ఇంకెవ రితోనూ వాడికి గొడవలు లేవు," అన్నాడా పెద్దమనిషి.

శిష్యుడి సమాచారసేకరణ అంతటితో ఆగిపోలేదు!

సుబ్బారాయుడికి నాలుగెకరాల పొల మున్నది. పాలేళ్ళనుపెట్టుకుని వ్యవసాయం చేయిస్తున్నాడు ఆయన. అందరిలోకీ పెద్ద పాలేరుతో ఆయనకు రోజూ గొడవే! వాడే అతడి గుండెజబ్బుకు కారణమని, ఒకాయన ఖచ్చితంగా చెప్పాడు.

శిష్యుడించుమించు ఇరవై మందిని అడిగి చూశాడు. అంతమందీ సుబ్బారా యుడి గుండె జబ్బుకు ఒకడు చెప్పిన

కారణం మరొకడు చెప్పలేదు. ఒక్క గుండె జబ్బుకు ఇన్ని కారణాలా? అని కలవర పడుతూ, శిష్యుడు యోగాపురానికి తిరిగి వెళ్ళి గురువుకు వివరాలు చెప్పాడు.

ఆ వివరాలన్నీ సుబ్బారాయుడు కూడా విన్నాడు.

సనాతనుడతడితో, "విన్నావు కదా! నాగాపురంలో చాలామందికి, నీకు రాబోయే గుండె జబ్బు గురించి ముందే తెలుసు. వాళ్ళకు దానికి కారణాలూ తెలుసు. అయితే ఒకరు చెప్పిన కారణం, ఇంకొకరు చెప్పిన కారణంతో సరిపోలడం లేదు. ఇంతమంది చెప్పిన కారణాల్లోంచి, ఒక్కే ఒక్క కారణాన్ని పట్టుకోగలిగితే, నీ జబ్బును నేను శాశ్వతంగా నయంచేయగలను. ఇది నీకు సంబంధించిన విషయం కాబట్టి, ఆ కారణాన్ని నువ్వే పట్టుకోవాలి!" అన్నాడు.

సుబ్బారాయుడుతలవంచుకుని,"అసలు విషయం నా చేత చెప్పించాలనే మీ తాపత్రయం. ఆ కారణం మీకెప్పుడో తెలిసిందని నేను గ్రహించాను. అంతమంది చెప్పిన కారణాల్లోంచీ ఒకే ఒక్క కారణాన్ని నేను పట్టుకున్నాను. అది నా అహంకారం! నేను నా అహంకారాన్ని విడిచిపెట్టక పోతే, నా మనసుకు స్థిమితముండదు. మనసు స్థిమిత పడేదాకా నా గుండెజబ్బు తగ్గదు. ఇదే కదా అసలు విషయం! అయితే నా అహంకారాన్నెలా తగ్గించుకోవాలో నాకు తెలియదు. అందుకు నేనేం చేయాలో చెప్పండి. తప్పక పాటిస్తాను," అన్నాడు.

ఇందుకు సనాతనుడు చిరునవ్వు నవ్వి, "నీలో కరుడుకట్టిన అహంకారమున్నదని గ్రహించావు కదా! సరి, ఆ సంగతి తెలుసుకుంటేచాలు, క్రమంగా నీ అహంకారం తగ్గిపోతుంది," అని కొంతకాలంపాటు వైద్యం చేసి పంపించేశాడు సుబ్బారాయుణ్ణి.

ఆ తర్వాత నుంచి సుబ్బారాయుడికి, కొడుకు వివేకిలా, వాడు చెప్పేది వినదగిందిగా తోచ సాగింది. ఇరుగుపొరుగులు ఆత్మీయుల్లా కనిపిస్తున్నారు. జమీందారు సకల సద్గుణ సంపన్నుడయ్యాడు. అందరి లోపాలూ క్షమించ తగ్గవిగానే తోస్తున్నాయి. కవుల కావ్యాల్లో తప్పులు కనిపించడం మానేశాయి.

సుబ్బారాయుడికి మళ్ళీ గుండెజబ్బు రాలేదు!



# గుడ్డిబిచ్చగాడు!

హేలాపురిలోని రామాలయం దగ్గర, ఒక బిచ్చగాడు ముష్టెత్తుకుంటూండేవాడు. వాడు తన ముందు ఒక చిన్నగుడ్డ పరిచి, ఆలయానికి వచ్చేపోయేవారిని, "అయ్యా, పుట్టుగుడ్డివాణ్ణి. తోచినధర్మంచేయండి!" అని అడుగుతూండేవాడు.

ఒకనాడు సుగంధపురినుంచి వచ్చిన యువకుడొకడు, దైవదర్శనం కోసం ఆలయంలోకి వెళ్ళి, తిరిగి వస్తూ అక్కడ వున్న బిచ్చగాళ్ళకేసి చూశాడు. వాళ్ళల్లో గుడ్డిబిచ్చగాడినంటూ యాచిస్తున్నవాడు అతణ్ణి బాగా ఆకర్షించాడు. ఇతర బిచ్చగాళ్ళందరి కంటే, వాడి ముందున్న గుడ్డలో ఎక్కువగా చిల్లర నాణాలున్నవి. యువకుడు చూస్తూండగానే వాడు వాటిని, ఒకటికి రెండుసార్లు పరిశీలుస్తున్నట్టుగా చూస్తూ, పక్కన వున్న డబ్బాలో వేయసాగాడు.

వాడు నిజంగా గుడ్డివాడు కాదేమో, అనుకుంటూ యువకుడు ముందుకు నడవబోతూండగా, "అయ్యా, ధర్మం!" అన్నాడు వాడు.

"ధర్మం చేస్తానుగానీ, నా కెందుకనో నువ్వు నిజంగా గుడ్డివాడివనిపించడంలేదు!" అన్నాడు యువకుడు.

ఆ వెంటనే బిచ్చగాడు, "బాబూ! దూరంగా ఆ ఆకుపచ్చరంగు మేడదాటిన తర్వాత, తుమ్మచెట్లకు పక్కగా వున్న కొబ్బరిచెట్టు తమకు కనబడుతున్నదా!" అని అడిగాడు.

"అవును, కనబడుతున్నది!" అన్నాడు యువకుడు.

"చూశారా, గుడ్డివాడికీ, మీకూ తేడా? ఆ చెట్టు నాకు కనబడడంలేదు!" అన్నాడు బిచ్చగాడు.

–కోనే నాగవెంకటఆంజనేయులు





# సామ్రాట్ అశోక

5

[మగధ చక్రవర్తి బిందుసారుడు వృద్ధుడై అనారోగ్యంతో ఉన్న సమయంలో, తక్షశిలలో తిరుగుబాటు బయలుదేరింది. దానిని అణచడానికి చక్రవర్తి జ్యేష్ఠకుమారుడు సుశేముడు సుముఖత చూపకపోవడంతో, కనిష్ఠ కుమారుడైన యువరాజు అశోకుడు సైన్యంతో వెళ్ళి, ఒక్కరోజులో తక్షశిల తిరుగుబాటును అణచి, తిరుగుబాటుదారుల పట్ల ఏమాత్రం కనికరం చూపకుండా మరణశిక్ష విధించాడు. – తరవాత]

అది ఒక సాయంకాలం. బిందుసార మహారాజు జ్యేష్ఠకుమారుడైన సుశేముడు, తన తమ్ములతో కలిసి వనవిహారానికి బయలుదేరాడు. రాజధాని పాటలీపుత్రం సమీపంలో ప్రవహించే నదీతీరంలో ఉన్న సుందర ఉపవనానికి వాళ్ళుచేరారు. రాజకుమారులు అక్కడ చేరడానికి ముందే వారికి కావలసిన భోజన పదార్థాలూ, పానీయాలూ, ఫలాలూ సేవకులు అక్కడ అమర్చారు. రాజకుమారులు ఉపవనంలోకి చేరిన తరవాత, మరెవ్వరూ లోపలికి రాకుండా అంగరక్షకులు తగు జాగ్రత్తలుతీసుకున్నారు. వాళ్ళు రుచికరమైన రకరకాల పిండివంటలు కావలిసినంత తిని, ఫలరసాలు సేవించి, ఉపవనం మధ్య పరచిన పట్టు తివాసీలపై కూర్చున్నారు. కొంత సేపటికి వాళ్ళ ఎదుట సుందరీమణుల నృత్యగాన ప్రదర్శనలు ప్రారంభమయ్యాయి.

యువతుల నృత్యగీతాలను చూసి ఆనం దిస్తూన్న సుశేముడికి, కొంతసేపటికి వెనక నుంచి ఏవో రణగొణధ్వనులు వినిపిం చాయి. అతడు వెనక్కు తిరిగి చూశాడు. ఒక అంగరక్షకుడు హడావుడిగా పరిగెత్తుకు వచ్చి, అతనికి నమస్కరించి, "ప్రభూ! మన దళనాయకుడొకడు భటులతో ఈ ఉపవనం లోకి ప్రవేశించాలంటున్నాడు. ఈ రోజు, ఈ వనంలోకి మరెవ్వరూ ప్రవేశించరాదని తమరు ఆజ్ఞాపించారని చెప్పాను. కాని, అతడు వినిపించుకోకుండా లోపలికి ప్రవేశించడానికి రాజముద్రికను చూపుతున్నాడు!" అన్నాడు.

"దళనాయకుడికి ఇప్పుడిక్కడేం పని?" అని అసహనంగా ప్రశ్నించాడు సుశేముడు.

"ఆ సంగతి చెప్పనంటున్నాడు. తమతో చెబుతాడేమో!" అన్నాడు అంగరక్షకుడు.

"సరే, త్వరగా రమ్మను!" అన్నాడు సుశే ముడు విసుక్కుంటూ.

అంగరక్షకుడు అక్కడినుంచి వెళ్ళి, కొంత సేపటికి దళనాయకుణ్ణి వెంట బెట్టుకుని తిరిగివచ్చాడు.

దళనాయకుడు యువరాజు సుశేము డికి నమస్కరించాడు. సుశేముడు అంగ రక్షకుణ్ణి వెళ్ళమన్నట్టు చేత్తో సైగ చేసి, "మావినోదానికి అంతరాయం కలిగించ డానికి నీ కెంత ధైర్యం!" అన్నాడు దళనాయ కుడికేసి కోపంగా చూస్తూ.

"తమకు అంతరాయం కలిగించడా నికి మేమెంతవారం ప్రభూ! అది మా ఉద్దేశమూ కాదు!" అన్నాడు దళనాయ కుడు.



"మరెందుకు వచ్చావు?" అని రెట్టించాడు సుశేముడు.

"రేపు సాయంకాలం ఈ ఉపవనం మధ్య ఒక బ్రహ్మాండమైన అభినందన సభ జరుగనున్నది. అందుకు కావలసిన వేది కను సిద్ధం చేయమని సేనాధిపతి ఆజ్ఞాపిం చారు. ఆయన ఆజ్ఞను నెరవేర్చడానికి నాతోపాటు వచ్చిన భటులు కొందరు, ఉపవనం వెలుపల తమ అనుమతికోసం కాచుకుని ఉన్నారు!" అన్నాడు దళనాయ కుడు.

"బ్రహ్మాండమైన అభినందన సభ! అంత గొప్ప అభినందనలు ఎవరికి?" అని అడిగాడు సుశేముడు.

"యువరాజు అశోకులవారికి!" అన్నాడు దళనాయకుడు.



అశోకుడిపట్ల సుశేముడికున్న ఈర్ష్య గురించి అంతకుముందే ఎరిగిన వాళ్ళు గనక, అతని కోపానికి ఆ యువతులు లోలోపలే నవ్వుకున్నారు.

కొంతసేపు మౌనం తరవాత, "ఈ వార్త ఇంతవరకు నాకెందుకు తెలియజేయలేదు?" అని దళనాయకుణ్ణి అడిగాడు సుశేముడు.

"ఆ విజయవార్త రాజధానికి చేరగానే, మహారాజుగారు తమకు తెలియచేయమన్నారు. కాని తమరు ఉన్నచోటు ఎవరికీ తెలియలేదు. అందువల్ల ఆవార్తను వెంటనే తమకు తెలియ జేయలేకపోయారు," అన్నాడు దళనాయకుడు.

"నోర్ముయ్," అన్నాడు సుశేముడు.

"తమరు కారణం అడిగారు గనక, చెప్పాను, క్షమించండి ప్రభూ!" అన్నాడు దళనాయకుడు.

"అంతా మాకుతెలుసు, ఊరుకో!"అంటూ సుశేముడు నిప్పుతొక్కిన కోతిలా,అటు ఇటూ తిరగసాగాడు. ఆ తరవాత పిడికిలి బిగించి ఆకాశంకేసి చూశాడు. తల పంకించి దళనాయకుణ్ణి సమీపించాడు. దళనాయకుడికి ఏం చేయాలో తోచక అలాగే నిలబడ్డాడు.

ఉన్నట్టుండి సుశేముడు తన వేలికివున్న వజ్రపుటుంగరం తీసి, దళనాయకుడి వేలికి తొడిగాడు. ఆ తరవాత నవ్వుతూ దళనాయకుడి వెన్ను తట్టాడు. ఈ ఆకస్మిక పరిణామానికి ఉక్కిరిబిక్కిరయిన దళనాయకుడు చిన్నగా నవ్వుతూ సుశేముడికి వంగినమస్కరించాడు.

"శుభవార్తను తెచ్చావు. అందుకే నీకీ బహుమతి. రేపు దీనికన్నా గొప్ప బహుమతి ఇస్తాను," అన్నాడు సుశేముడు.

"అశోకుడికి ఎందుకు అభినందనలు?" అని అడిగాడు సుశేముడు.

"ప్రభూ! యువరాజు అశోకుడు తిరుగుబాటును తృటికాలంలో అణచి విజయవంతంగా తిరిగివస్తున్నాడు. ఆయనకు ఘన స్వాగతం పలకడానికి అన్ని ఏర్పాట్లూ జరుగుతున్నాయి," అన్నాడు దళనాయకుడు వినయంగా.

ఆమాట వినగానే సుశేముడి ముఖం వెలవెల బోయింది. అతని తమ్ములు పిడుగుపాటుకు లోనైనట్టు దిగ్భ్రాంతి చెందారు. ఎవరి నోటినుంచీ మాటరాలేదు. దళనాయకుడి మాటలు విన్న ఒక నాట్యకత్తె, "ఆహా! ఎంత సంతోషకరమైన వార్త!" అన్నది.

"ఛీ, నోర్ముయ్!" అన్నాడు సుశేముడు పట్టరాని కోపంతో.

"కృతజ్ఞుణ్ణి, మహాప్రభూ!" అంటూ దళ నాయకుడు చేతులు జోడించాడు.

"అయితే, ఆబహుమతి అందుకోవాలంటే నువ్వొక పనిచేయాలి!" అన్నాడు సుశేముడు.

ఏమిటి అన్నట్టుచూశాడు దళనాయకుడు.

"అది తరవాత చెబుతాను. ఇప్పుడునే నెవరోచెప్పు, చుద్దాం," అన్నాడు సుశేముడు.

"అదేమిటి ప్రభూ! యువరాజుగారు కదా!" అన్నాడు దళనాయకుడు.

"ఈనాటి యువరాజు అంటే, ఈ రాజ్యా నికి ఏమవుతాను?" అని అడిగాడు సుశేముడు.

"కాబోయే మహారాజు ప్రభూ!" అన్నాడు దళనాయకుడు.

"శభాష్! చక్కగా చెప్పావు. కాబోయే మహారాజుకు నీ సహకారం అందించావంటే, నీ భవిష్యత్తు బంగారమవుతుంది. సరేనా?" అన్నాడు సుశేముడు.

"ఆజ్ఞాపించండి,ప్రభూ! శిరసావహిస్తాను," అన్నాడు దళనాయకుడు వేలి వజ్రపుటుంగ రాన్ని, సంతోషంగా తడువుకుంటూ.

"అశోకుడి అభినందనసభ ఏర్పాట్లన్నీ నీ ఆధ్వర్యంలోనే కదా జరుగుతున్నాయి. ఆ ఏర్పాట్లన్నీ ఘనంగా, అపూర్వరీతిలో జర గాలి. ఆసన్మానంతరవాత పరిచారికా పుత్రు డికి మరేసన్మానమూ అవసరంలేనంత పరి పూర్ణంగా, పకడ్బందీగా జరగాలి. తెలిసిందా?" అన్నాడు సుశేముడు.

ఆ మాటలు వినగానే దళనాయకుడి కనుబొమలు ముడిపడ్డాయి. కాని సుశే ముడు ఆప్యాయంగా వాడి చేయి పట్టు కుని, "అప్పుడే కంగారు పడకు పిరికిపందలా. దళనాయకుడివి సేనాధిపతి కావాలంటే నామాటవిను. ఏంచేయాలో వివరంగా చెబు తాను. రా," అంటూ నిర్మానుష్యంగా వున్న పొదలచాటుకు తీసుకుపోయాడు.





మరునాడు సాయంకాలం అశోకుడికి స్వాగతం పలకడానికి మగధరాజ్య ప్రధాన మంత్రీ, ఇతర మంత్రులూ, సేనాధిపతీ, దళనాయకులూ, అధికారులూ, పురప్రముఖులూ, రాజకుటుంబానికి చెందిన సుశేముడూ అతని సోదరులూ ఉపవనం చేరారు.

సూర్యుడు అస్తగిరిని చేరుకుంటున్నా, ఇంకా అశోకుడి జాడ కనిపించలేదు. ప్రధానమంత్రి సేనాధిపతిని, "మన యువరాజు రావడానికి ఇంత ఆలస్యమయిందేమిటి?" అని అడిగాడు.

"సూర్యాస్తమయంలోగా ఇక్కడికి చేరాలి. మార్గమధ్యంలో ఏదో అంతరాయం కలిగి ఉంటుంది," అన్నాడు సేనాధిపతి.

అంతలో గుర్రం మీద వేగంగా వచ్చిదిగిన ఒకదూత, అందరికీ నమస్కరించి, ప్రధాన మంత్రితో, "యువరాజుల వారికి మార్గ మధ్యంలో వున్న విక్షుపుర ప్రజలు గుమిగూడి ఘనస్వాగతం పలికారు. వాళ్ళ మధ్య నుంచి బయటపడడానికి గంటసేపు పట్టింది. అందుకే ఆలస్యమయింది. యువరాజు సైన్యంతో బయలుదేరారు. త్వరలో రాగలరు," అన్నాడు.

సుశేముడు పక్కనే వున్న తన మిత్రుడి కేసి చూస్తూ నర్మగర్భంగా మందహాసం చేశాడు. సుశేముడి పథకం ప్రకారమే విక్షుపురంలో జనం గుమిగూడి, స్వాగతం పేరిట అశోకుడి ప్రయాణానికి ఆలస్యం కలగించారన్న విషయం సుశేముడికీ, అతని విశ్వాస పాత్రులకూ మాత్రమే తెలుసు. చీకటిపడిన తరవాతే, అశోకుడు ఉపవనానికి చేరేలాగా చేయాలన్నది వాళ్ళ పథకం!

ఉపవననానికి వెళ్ళే బాటకు ఒకవైపున ఎత్తయిన ఏటికట్ట ఉన్నది. నది పొంగినప్పుడు, వెల్లువ వెలుపలికి ప్రవహించి భూభాగాన్ని ముంచెత్త కుండా ఉండడానికి నదీతీరం పొడవునా కొంతదూరం పెద్ద పెద్ద బండ రాళ్ళతో ఎత్తయిన కట్టను నిర్మించారు. అది నిర్మించి చాలా కాలమయింది. అందువల్ల అక్కడక్కడ బండరాళ్ళు ఊడిపోయి వదులుగా ఉన్నాయి.

సూర్యుడు అస్తమించి చీకటి నాలుగు దిక్కులనూ ఆవరిస్తున్నది. అక్కడక్కడవున్న పెద్దపెద్ద స్తంభాల మీద భటులు జ్యోతులు వెలిగించారు. ఆ సమయంలో దూరంగా గుర్రాల డెక్కల చప్పుడు వినిపించింది. "మౌర్య చక్రవర్తి బిందుసార మహారాజుకు జై!" అనే నినాదాలు వినిపించాయి.

ఉపవనంమధ్య చేరిన వాళ్ళందరూఉరక లెత్తే ఉత్సాహంతో వస్తూన్న సేనలకేసి చూడ సాగారు. సేనలు కంటబడగానే, "వీరాధి వీరుడు యువరాజు అశోకుడికీ జై! యువ రాజు అశోకుడికీ జై!" అనే నినాదాలు మిన్నుముట్టాయి.

సుశేముడూ, అతని అనుచరులూ చెప్ప రాని ఉద్రిక్తతకులోనయ్యారు.

ప్రధానమంత్రి మహారాజు తరఫున యువ రాజు అశోకుణ్ణి పుష్పమాలాంకృతుణ్ణి చేయ డానికి చేతిలో పుష్పహారంతో నిలబడ్డాడు.

అశోకుడి సేనలు ఏటికట్టను సమీపించి, దాని దాపులనున్న ఉపవనంలోకి దారితీసే బాటలో ప్రవేశించాయి. అక్కడ గుమి గూడిన ప్రజల ఆనందానికి అవధులు దాటాయి!

వస్తూన్న సేనలమధ్య హఠాత్తుగా పెళపెళా రావాలు వినిపించాయి. మసక చీకటిలో ఏదీ స్పష్టంగా కనిపించలేదు. కాని సైనికుల హాహా కారాలు, వేదనాస్వరాలుమాత్రంనాలుగు దిక్కులా ప్రతిధ్వనించాయి.

"ఏమిటది? ఏం జరిగింది? నా సోదరుడు అశోకుడు క్షేమమే కదా?" అని అరిచాడు సుశేముడు ఆవేశంతో. అతని ప్రశ్నలకు ఎవరూ సమాధానం చెప్పలేకపోయారు. కొందరుభటులు దివిటీలుపట్టుకుని ముం దుకు పరిగెత్తారు. అసరికే పెద్దపెద్ద బండలు ఏటికట్ట పై నుంచి దొర్లుకుంటూ వచ్చి, సేనలమీదపడి కొందరు సైనికులను నుగ్గు నుగ్గు చేశాయి. దాంతో మిగిలిన సైనికులు కూడా భయభ్రాంతులై హాహాకారాలు చేస్తూ, దిక్కుకొకరుగా పరిగెత్తసాగారు.

ప్రధానమంత్రీ, సేనాధిపతీ అశోకుడికోసం వెతుకుతూ, "యువరాజా! తమరెక్కడున్నారు? యువరాజా! యువరాజా!" అని బిగ్గరగా పిలువసాగారు.

కొంతసేపటికి ఏటికట్టపై నుంచి అశోకుడి కంఠస్వరం గంభీరంగా వినిపించింది: "నేను క్షేమంగా ఉన్నాను. మొదట నేను చెప్పినట్టు చేయండి. బండలకిందపడి క్షత గాత్రులైన వారిని జాగ్రత్తగా వెలుపలికి తీసి, దాపులనున్న విడిదిగృహాలకు తరలించండి. కట్టపై నుంచి బండలను సైనికులపై దొర్లించి పారిపోతూన్న దుండగులను తరిమి పట్టు కోండి. మమ్మల్ని హతమార్చాలన్న వాళ్ళ దురుద్దేశం తెలుస్తూనే ఉన్నది. కాని, వాళ్ళెవ రైనదీ తెలుసుకోవాలి!"–(ఇంకావుంది)



# దివాణం ఉద్యోగం

శంఖవరంలో మారయ్యకు లౌక్యుడు, తెలివిగలవాడన్న పేరుండేది. ఒకసారి ఆయన కుమార్తె వివాహం కోసం, డబ్బు అవసరం అయింది. గ్రామంలోని వడ్డీవ్యాపారి చెలమయ్య నడిగితే – ఏ తిక్కనున్నాడో ఏమో లేవనేశాడు.

ఇది జరిగిన పదిరోజులకు, అల్లవరం దివాణంలో దివానుకు సహాయపడే ఉద్యోగం ఒకటి ఖాళీ అయింది. దానికోసం ఎందరో యువకులు పోటీ పడగా, చివరకు ఇద్దరు యువకులు సమఉజ్జీలుగా నిలిచారు.

ఆ ఇద్దరిలో ఎవరికి ఉద్యోగం ఇచ్చేదీ వారం రోజుల్లో తెలియజేస్తానని చెప్పి, దివాను వాళ్ళను పంపేశాడు. ఆ ఇద్దరిలో ఒకడు వడ్డీవ్యాపారి చెలమయ్యకొడుకు.

ఈ సంగతి విన్న మారయ్య, చెలమయ్యను కలుసుకుని, "మీ అబ్బాయి దివాణంలో ఉద్యోగ ప్రయత్నం చేస్తున్నట్టు తెలిసింది. అల్లవరం దివాను సింహాద్రి సుందరయ్యా, నేనూ ఒకే గురువువద్ద చదువుకున్న మంచి మిత్రులం. అదృష్టంకొద్దీ వాడు దివానయ్యాడు; నేనిలా సామాన్యరైతుగా మిగిలిపోయాను. నాకు మూడువేల వరహాలివ్వు. దాన్ని లంచం అనుకోకు. మీ వాడికి ఉద్యోగం వచ్చేలా గట్టి ప్రయత్నం చేస్తాను. ఒకవేళ, కాలేదూ, నీ డబ్బు నీకు తిరిగిస్తాను," అన్నాడు.

చెలమయ్య మారుమాట్టాడకుండా, మారయ్యకు మూడువేల వరహాలిచ్చాడు. వారం రోజుల తర్వాత చెలమయ్యకొడుక్కు దివాణంలో ఉద్యోగం దొరికింది. ఇది తెలుసుకున్న మారయ్య భార్య, అతణ్ణి, "అల్లవరం దివాను మీ స్నేహితుడని, ఏనాడూ నాతో అనలేదు!" అన్నది నిష్ఠూరంగా.

అందుకు మారయ్య నవ్వి, "నిజానికి అల్లవరం దివానూ, నేనూ స్నేహితులం కాదు. ఆ ఉద్యోగం చెలమయ్యకొడుక్కు ఇవ్వమని, ఆయన్ను నేను కోరలేదు. అదృష్టం కొద్దీ ఉద్యోగం చెలమయ్య కొడుక్కు వచ్చింది. ఏమైతేనేం, మన అవసరం తీరిపోయింది. జరిగింది చెప్పి, చెలమయ్యకు త్వరలోనే వడ్డీతో సహా డబ్బు తిరిగియిచ్చేస్తాను," అన్నాడు.

– బొడ్డేడు బలరామస్వామి





# సునయన కథ

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్నిదించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఈ అర్ధరాత్రివేళ పిశాచగణాలూ, విషసర్పాలూ తిరుగాడే ఈ భీతిగొల్పే శ్మశానంలో, నువ్వు నానా యాతనలకూ గురికావలసిరావడం, ఏదైనా శాపకారణంగానా అన్న శంక కలుగుతున్నది. మానవులు తమకు తెలిసో, తెలియకో చేసే పాపాలకూ; దేవతలపట్లా, మహామహులైన తపోధనుల పట్లా అజాగ్రత్త వల్లనో, అహంకరించో చేసే అపచారాలకూ తప్పక శాపగ్రస్తులవుతారు. నువ్వు అలాంటి వారిలో ఒకడివేమో తెలియదు. ఏమైనా, మునుముందు నీకు హెచ్చరికగా వుండేందుకు, సునఘున అనే రాకుమారి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

## బేతాళ కథలు



వినయపురి రాజదంపతులకు వివాహం అయి పదహారు సంవత్సరాలు గడిచినా, సంతానభాగ్యం కలగలేదు. ఆ దంపతులు దర్శించని పుణ్యక్షేత్రం, మొక్కని దేవుడులేడు.

ఇలా వుండగా – వర్షాకాలం రోజుల్లో, ఒకనాటి అర్ధరాత్రివేళ ఉరుములూ, పిడుగుపాట్లతో ప్రళయ భయంకరంగా వర్షం కురుస్తున్న సమయంలో, నగరానికి దాపుల నున్న పెద్ద కొండ నిలువునా పేలిపోయి నట్టుగా కర్ణ కఠోరమైన శబ్దం వినిపించింది.

ఆశబ్దానికి రాణి శయ్యపైనుంచి ఉలిక్కి పడి లేచికూర్చున్నది. ఆ తర్వాత కొద్దిసేపటికి వర్షం ఆగిపోయి, అంతటా నిశ్శబ్దం ఆవరించింది. రాణి తిరిగి శయ్యపై పడుకుని నిద్ర లోకిజారుకున్నది. ఆ స్థితిలో ఆమెకొక కల వచ్చింది. కలలో సర్వాంగభూషిత అయిన దుర్గాదేవి ఆమెకు ప్రత్యక్షమై, "ఎంతో కాలంగా కొండరాళ్ళతో, మహావృక్షాలతో కప్పబడి కనుమరుగైపోయిన నా ఆలయం వర్షపాతానికి బయటపడింది. శిథిలావస్థలో వున్న ఆలయాన్ని పునరుద్ధరించు, నీకు మేలుకలుగుతుంది!" అని చెప్పి అంతర్ధాన మైంది.

తెల్లవారాక రాణి తన కలగురించి రాజుకు చెప్పింది. రాజునమ్మ లేనన్నట్టుగా తలవూపి, "ఆ కొండమీదికి చేరడానికి సరైన దారికూడా లేదు. అక్కడ దేవాలయం వుండడం కల్ల. కలల్ని నమ్మి లేనిపోని భ్రమలకు గురికాకు!" అన్నాడు.

"ఒకసారి వెళ్ళి చూద్దాం. ఏదో కొంతశ్రమ తప్ప, కలగబోయే నష్టం ఏమీ లేదు కదా!" అన్నది రాణి.

ఆ సాయంత్రం రాజూ, రాణీ కొద్ది పరివారంతో, అతికష్టం మీద కొండపైకి చేరుకున్నారు. అక్కడ శిథిలావస్థలో వున్న దుర్గాదేవి ఆలయాన్ని చూసి ఆశ్చర్యపోయారు. రాజుగారి ఆదేశాల మేరకు, ఆరు మాసాలలో ఆలయపునరుద్ధరణ జరిగింది. కొండ మీదికి దారి ఏర్పడింది.

దుర్గాదేవికి అర్చనలు ఆరంభమయిన రోజునే, రాణీ గర్భవతి అనే విషయం వెల్లడయింది. ఆ రాజదంపతుల ఆనందానికి అవధులు లేవు. దేవీవిగ్రహానికి ప్రత్యేకంగా వెండి కళ్ళు చేయించి, స్వయంగా అలంకరిస్తానని మొక్కుకున్నదిరాణి. అయితే, గర్భవతి కావడంతో కొండ ఎక్కడం శ్రమతో కూడినపని అని ఆ ప్రయత్నం విరమించుకున్నది.

క్రమంగా నవమాసాలు నిండి పండంటి ఆడపిల్లను కన్నది, రాణి. పచ్చటిపసిమితో, నల్లని ఉంగరాలజుట్టుతో, చెంపకు చారెడేసి కళ్ళతో అందాలొలికిస్తున్న, ఆ బిడ్డను చూడ డానికి అంతఃపురంలో వారికి రెండు కళ్ళూ చాలలేదు.

పండితులు ఆ పాప అందమైన కళ్ళు చూసి, "జాతకరీత్యా స అక్షరంతో, ఆ పాప పేరుమొదలయితే మంచిది. ఈమెకు సున యన అనే పేరు అతికినట్టుగా సరిపోతుంది," అన్నారు.

అయితే, బిడ్డపుట్టిన రెండోరోజునే, అంత అందమైన కళ్ళు వున్నా సునయన ఏమీ చూడలేదనీ, ఆమె పుట్టుగుడ్డి అనీ రాజ వైద్యులు తేల్చిచెప్పారు. ఈ దుర్వార్త వినగానే రాజదంపతులు ఎంతగానో దుఃఖించారు.



చూపు లేదన్న లోటు తప్పించి, సునయన అమితమైన తెలివితేటలు గలది. తీయని మధురమైన కంఠస్వరం ఆమె సొత్తు. కాని, అంధత్వం ఆమె పాలిట శాపంగా భావించి, తల్లిదండ్రులు దిగులు పడుతూండేవారు.

అలాకాలం గడిచి, సునయనకు పెళ్ళీడు వచ్చింది.ఆమె ఎంతటి సౌందర్యరాశి అయినా, చూస్తూ చూస్తూ ఒక గుడ్డిపిల్లను ఏ రాజకుమారుడైనా ఎలా వరించగలడని బెంగపట్టుకున్నది రాజదంపతులకు.

"నా వివాహం గురించి మీరు బెంగ పడకండి. అంతా ఆదుర్గాదేవిదే భారం!"అని, తల్లిదండ్రులను ఊరడిస్తూండేది సునయన.

ఆమె ప్రతి సాయంత్రం తన ఇష్టసఖితో, కొండమీది దుర్గాదేవి ఆలయానికి వెళ్ళి వస్తూండేది. అక్కడ ప్రసాదం తీసుకున్నాక, ఆలయం వెనకవున్న కొండరాళ్ళ మీద కూర్చుని, చల్లని గాలికి సేదతీరడం ఆమె దినచర్య.

ఒకరోజున ప్రసాదం తీసుకున్నాక ఆమె గుడివెనకవైపుకు వచ్చింది. ఆమె ఇష్టసఖి, ఆమెనొక రాయి మీద కూర్చోబెట్టి, "రాకు మారీ, నీ కమ్మనిగొంతుతో నాలుగు తీయని పాటలు పాడు," అన్నది.

సునయన దేవిని స్తుతిస్తూ పాట ప్రారం భించగానే, ఆమె ఇష్టసఖి అక్కడినుంచి నిశ్శబ్దంగా వెళ్ళిపోయింది. ఆలయంలో పనులు చేస్తున్న యువశిల్పితో ఆమె వివాహం కొద్దిరోజులలో జరగనున్నది. సన్నజాజి, మల్లె, నందివర్ధనం పూలపరిమళాలను మోసుకు వస్తున్న చల్లగాలికి పరవశించి మనోహరంగా పాడుతున్నది, సునయన.



ఆసమయంలో, దేశాటనలో వున్న చంద్ర గిరి యువరాజు సుధాకరుడు, కొండ ఆవలి వైపునుంచి ఎక్కడంతో, సునయన వున్న ప్రదేశానికి చేరుకున్నాడు. అతడు గొప్ప చిత్రకారుడు. తండ్రి అంగీకారంతో అనేక రాజ్యాలు తిరుగుతూ కొన్ని వందలప్రదేశాల, వ్యక్తుల చిత్రాలు గీశాడు. ఇప్పుడు సునయన అపురూప సౌందర్యం అతడి కళ్ళను చెదర గొట్టింది. అంతటి అద్భుత సౌందర్యరాశిని, అతడు కలలో కూడా చూసివుండలేదు.

సుధాకరుడు అప్పటికప్పుడు, తన్మయ త్వంతో పాటలు పాడుతున్న సునయనచిత్రం గీశాడు. చిత్రం ముగిసే సరికి సునయన చెలికత్తె రానేవచ్చింది. ఆమె వస్తూనే, "చీకటి పడబోతున్నది. వెళదాం పదండి యువరాణీ!" అన్నది.

ఆమె కళ్ళబడకుండా, ఒక బండరాయి వెనకదాగాడు సుధాకరుడు. ఆ సౌందర్యరాశి ఆ రాజ్యపు యువరాణి అని గ్రహించి, పెళ్ళంటూ చేసుకుంటే ఆమెనే చేసుకోవాలని దృఢంగా నిశ్చయించుకున్నాడు.

ఇది జరిగాక, సుధాకరుడు దేశాటన ముగించుకుని తిరిగి తన రాజ్యం చేరాడు. ఆ రాత్రి అతడి తండ్రి కాంతివర్మ, కొడుకు పర్యటన విశేషాలడిగి తెలుసుకుని, "నీకొక శుభవార్త, నాయనా! మన చక్రవర్తి ఏకైక కుమార్తె కాంచనకు నిన్ను వివాహమాడాలని వున్నదట. చక్రవర్తి నీ అభిప్రాయం తెలుసు కురావలసిందిగా దూతలను పంపాడు. సామంతులమైన మనకు చక్రవర్తితో వియ్యం ఆడే అదృష్టంపట్టింది!" అన్నాడు ఆనందంగా.

సంవత్సరం కిందట సుధాకరుడు గొప్ప చిత్రకారుడనివిన్న, చక్రవర్తి,అతడిని అతిథిగా పక్షం రోజులు తమ అంతఃపురంలో వుంచు కుని, తమ కుటుంబసభ్యుల చిత్ర పటాలు గీయించుకున్నాడు. అప్పుడే యువరాణి కాంచ నకు, సుధాకరుడితో పరిచయమయింది.

కాంచన మితిమంచిన స్థూలశరీరురాలు. దీనికి తోడు ఒక కాలు అవుడు; పరమ కోపిష్ఠి. సుధాకరుడు ఆమె రూపాన్ని గుర్తు చేసుకుంటూ, "ఆ అవిటి స్థూలకాయురాలి తోనా, నా వివాహం!" అన్నాడు విసురుగా.

ఆ జవాబుకు కోపగించుకున్నరాజు కాంతి వర్మ, "నువ్వు నవమన్మధుడివాఏం?గూనీ, మెల్లకన్నూ," అన్నాడు తీవ్రస్వరంతో.

కన్నతండ్రే తన రూపాన్ని అలా ఈసడించే సరికి సుధాకరుడు విలవిల్లాడిపోతూ, "క్షమిం చండి, నాన్నగారూ! నేను వేరొక యువతిని

వరించాను. ఆమె వినయపురి యువరాణి!" అంటూ సునయన చిత్రాన్ని తెచ్చి తండ్రికి చూపించాడు.

సునయన అందం చూసి నిర్ఘాంతపోయాడు, కాంతివర్మ. తర్వాత కొద్దిసేపు మౌనంగావుండి, "నేనన్నదానికి బాధపడకు. చక్రవర్తి కుమార్తెను తిరస్కరిస్తే రాబోయే పరిణామం తీవ్రంగా వుండవచ్చు. మనం సామంతులం. రాజ్యాన్నే కోల్పోయే ప్రమాదం వున్నది," అన్నాడు.

"ఆ పరిణామాలకు నేను సిద్ధమే, నాన్నగారూ!" అన్నాడు సుధాకరుడు దృఢస్వరంతో.

కొడుకు పట్టుదల గురించి బాగా ఎరిగి వున్న కాంతివర్మ, సునయన ఆమె తండ్రిని గురించిన సమాచారం కోసం వినయపురానికి చారులను పంపించాడు. వాళ్ళు తిరిగివచ్చి, సునయన పుట్టుగుడ్డి అన్న సంగతి కాంతివర్మకు చెప్పారు.

ఈ సంగతి తెలియగానే కాంతివర్మ, కొడుకుమందిరానికి వెళ్ళి, "నాయనా, ఆ సునయనతో నువ్వు మాట్లాడలేదు. దూరంగా వుండి, ఆమె చిత్రం గీశావు. అంతేకదా?" అని ప్రశ్నించాడు.

సుధాకరుడు అవునన్నట్టు తలవూపాడు. అప్పుడు కాంతివర్మ, "ఆ రాకుమారి అద్భుత సౌందర్యరాశి అన్నమాట నిజం. కాని, పాపం ఆమె పుట్టుగుడ్డి!" అన్నాడు జాలిపడుతూ.

సుధాకరుడు ఒక క్షణం నివ్వెరపోయి, తండ్రి మాటనమ్మలేనన్నట్టుగా చిత్రంలోని సునయన కళ్ళకేసి కొంతసేపు పరీక్షగా చూసి, "అయితే, మరీ మంచిది. సునయనతోనే, నా వివాహం," అన్నాడు.



కాంతివర్మ వెంటనే, "శుభం! త్వరలోనే నీ వివాహం సునయనతో జరుగుతుంది," అంటూ కొడుకును ఆశీర్వదించి, తనమందిరానికి వెళ్ళిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, సుధాకరుడి వివాహం చక్రవర్తి కుమార్తెతో జరగకపోతే, సామంతుడైన తనకు అనర్థం జరుగుతుందని కాంతివర్మ భయపడ్డాడు. చారులద్వారా ఆమె పుట్టు గుడ్డి అని తెలిశాక, వివాహానికి మరింత కఠినంగా అభ్యంతరం చెప్పకపోగా, కొడుకును ఆశీర్వదించడం వింతగా లేదా? మరొక సందేహం. సునయన అంధురాలని విన్నాక సుధాకరుడు– అయితే మరీ మంచిది! అనడం విడ్డూరంగా లేదా? తను కోరి వివాహమాడనున్న యువతి అంగవైకల్యానికి విచారిం

చడంపోయి, అతడు ఆనందిస్తున్నట్టు కనబడుతున్నది. వీటన్నిటినీ అలావుంచి- సునయన అంధురాలుగా జన్మించడం, చక్రవర్తి ఏకైక కుమార్తెను వివాహమాడే అవకాశాన్ని సుధాకరుడు చేజేతులా జారవిడుచుకోవడం చూస్తూంటే, ఇద్దరూ శాపగ్రస్తులేమో అన్న సందేహం కలగడం లేదా? ఈ సందేహాలకు సమాధానాలు తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "రాజు కాంతివర్మ, మొదట సుధాకరుడు, సునయనను వివాహమాడడానికి అభ్యంతరం చెప్పడం, తర్వాత అతణ్ణి ఆశీర్వదించడంలో వింత పడవలసిందేమీలేదు. తన కొడుకు, చక్రవర్తి కుమార్తెను నిరాకరించడం, తన సామంత రాజ్యానికి క్షేమం కాదని అతడు భయపడినట్టు తెలుస్తూనే వున్నది. అయితే, ఒక జాత్యంధురాలిని తన కొడుకు ప్రేమించి వివాహమాడనున్నాడని వార్త పంపితే - ఆయన తప్పక సుధాకరుడి త్యాగబుద్ధిని హర్షిస్తాడని కాంతివర్మకు నమ్మకం కుదిరింది. గొప్ప చిత్రకారుడైన యువకుడు, చక్రవర్తి అంతటివాడి కుమార్తెను వివాహమాడనని తృణీకరించాడంటే - అది ఆ యువకుడి ఔన్నత్యాన్నీ, మానసిక పరిపక్వతనూ, చాటుతుంది. ఇకపోతే, సుధాకరుడు, సునయన పుట్టుగుడ్డి అని తండ్రి ద్వారా విన్నప్పుడు; అయితే, మరీ మంచిది- అనడానికి తగిన కారణం వున్నది. తను గొప్ప చిత్రకారుడే కావచ్చు. కాని, తను ఏమాత్రం రూపసికాడు, గూనీ, మెల్లకన్నూ! నిజంగా సునయన అంధురాలు కాకుంటే, ఆమె తనను మనసారా ఇష్టపడి వివాహమాడడం సంభవం కాకపోవచ్చు! సుధాకరుడు, సునయన శాపగ్రస్తులా అన్న ప్రశ్న, అంత యుక్తియుక్తమైనది కాదు. లోకంలో ఎందరో సుఖాల మధ్యా, మరెన్నో కష్టాల మధ్యా జీవయాత్ర సాగిస్తూంటారు. ఆ కారణంగా, కొందరు వరప్రసాదులనీ, ఇంకొందరు శాపగ్రస్తులనీ అనుకోవడం మంద బుద్ధుల సూత్రీకరణ అవుతుంది," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. -(కల్పితం)

[ఆధారం: మాచిరాజుకామేశ్వరరావు రచన]





# అంకన్న చెవుడు

భూస్వామి భూషయ్య ఇంటికి కన్నం వేస్తూ దొరికిపోయిన అంకన్నకు, రెండేళ్ళు జైలు శిక్షపడి, ఆనాటితో పూర్తయింది. కొత్వాలు వాణ్ణి పిలిచి సంగతి చెప్పి, "ఒరే, దొంగతనం తప్పని, ఈపాటికి నీకు తెలిసుండాలి, అవునా?" అని ప్రశ్నించాడు.

దానికి అంకన్న వినయంగా, "అయ్యా, పుట్టు వెర్రివెధవ తప్ప, ఈలోకంలో దొగతనం, మోసం తప్పని తెలియని వాడెవుడుంటాడు!" అన్నాడు.

"తప్పని తెలిసీ దొంగతనం చెయ్యాలని ఎందుకనుకున్నావు?"అని అడిగాడుకొత్వాలు.

"కులవృత్తి మానకూడదనేది పెద్దలు చెప్పే మాట. మా తాత ముత్తాతల నుంచి కూడా, ఇది మా కులవృత్తి. నేను దొంగతనం తప్పంటే – అది నా వంశంలోని పెద్దలందర్నీ అవమానించి నట్టవుతుంది!" అన్నాడు అంకన్న.

కొత్వాలుచిన్నగానవ్వి,"సరే,బయటికెళ్ళాక, ఏంచేయాలనుకుంటున్నావు?" అనిఅడిగాడు.

"క్రమం తప్పకుండా చెవులు శుభ్రం చేసుకోదలిచాను," అన్నాడు అంకన్న.

"ఏరా, నాతోనే వేళాకోళాలా?" అంటూ కళ్ళెర్ర చేశాడు కొత్వాలు.

అంకన్న చేతులు జోడించి, "అయ్యా,నేను మీతో వేళాకోళాలాడగలిగినంత వాణ్ణా! నేను చెపుతున్నది, మీరడిగిన దాన్ని గురించే," అన్నాడు.

"ఒరే, నీమాటల్లో ఏదో మర్మం వుంది. కాస్త వివరంగా చెప్పు," అన్నాడు కొత్వాలు.

అంకన్న ఒకటి, రెండు క్షణాలు తటపటా యించి, "అయ్యా, భూస్వామి భూషయ్యగారి ఇంటికి ఆ కన్నం వేయడానికి వారంరోజులు ముందుగానే ఏదో పనికల్పించుకుని, ఆయన గారింటికి వెళ్ళి, ఇనప్పెట్టె ఎక్కడ వుందో పసిగట్టాను. కన్నం ఎక్కడ వేయాలో ఆలో

వారణాశి శ్రీరామక్రిష్ణ

చించి, గోడ బయట ఒక గుర్తు పెట్టాను. ఆరాత్రి ఆగుర్తును సరిగా పోల్చుకోలేక, ఇనప్పెట్టె పక్కగా వెయ్యాల్సిన కన్నాన్ని,సరిగ్గా ఇనప్పెట్టె వెనక వేశాను. గునపం దెబ్బతగిలి పెట్టె చిన్నగా శబ్దమయింది. అది కొండమీది గుడిలో గంట మోగినంత స్వల్పంగా వినిపించింది. అయితే, మరుక్షణంలోనే భూషయ్య గారూ, ఆయన పనిమనుషులిద్దరూ వచ్చి, నన్ను కన్నం దగ్గిరే పట్టేశారు," అన్నాడు.

వాడిమాటలకు కొత్వాలు, "అది సరే! ఆక్రమంతప్పకుండా చెవులు శుభ్రం చేసుకోవడం ఏమిటో, ఆ సంగతి మాత్రం చెప్పలేదు," అన్నాడు.

"అయ్యా, అదే చెప్తాస్తున్నాను. భూషయ్య గారు నన్ను రెండు, మూడు దెబ్బలేశాక,'ఏరా, నీ కెంత ధైర్యం! గునపం పోటుకు ఇనప్పెట్టె ఖంగు, ఖంగుమంటున్నా నిద్రలేవని మొద్దు ననుకుంటున్నావా? ఆ శబ్దానికి కుంభకర్ణుడైనా నిద్రలేస్తాడే!' అన్నాడు. ఆమాటలతో నాకు చెవుడు పట్టుకున్నదేమో అన్న అనుమానం కలిగింది. జైల్లో చేరాక, చిన్నపుల్లకు ఇంత దూదిచుట్టి చెవులు శుభ్రంచేసుకోవడం మొదలెట్టాను. ఈ రెండేళ్ళలో చెవులుబాగై, చీమ చిటుక్కుమన్నా వినపడడం మొదలైంది. అందుకే క్రమం తప్పకుండా, ఆ పనిచేయాలనుకుంటున్నాను," అన్నాడు.

ఆ మాటలకు కోపగించుకున్న కొత్వాలు, "అంటే, ఎప్పటిలా కన్నపుదొంగగా బతుకుతాననే కదా, నీ మాటలకర్థం?" అన్నాడు.

అంకన్న మౌనంగా వూరుకున్నాడు. అప్పుడు, కొత్వాలు చేతికర్రతో వాడి భుజం తట్టి, "ఒరే, మతిమాలిన వెధవా, నీ వాక సంగతి గ్రహించినట్టులేదు. ఆరోజు రాత్రి, నువ్వు భూషయ్యగారింటి గోడకు పెట్టినగుర్తు, నీ కంటికి కనబడలేదంటే – నీకు ఎంతో కొంత రేజీకటితో పాటు ఛత్వారం కూడా వచ్చి వుంటుంది," అన్నాడు.

వెంటనే అంకన్న, కొత్వాలు కాళ్ళమీద పడి, "అయ్యా! నాకు నలభై ఐదేళ్ళవయసు. అప్పుడు చెవులు వినబడకా, ఈసారి కళ్ళు సరిగా కనబడకా, ఇంకోసారి జైలు పాలవ్వాలని లేదు. ఆభూషయ్యగారిదగ్గరేఏదైనాపని ఇప్పించండి. బుద్ధిగాబతుకుతాను," అన్నాడు.

కొత్వాలు తృప్తిగా తలాడించి, "వెంటరా! ఇప్పుడే ఆభూషయ్యగారి దగ్గరి కెళదాం," అంటూ బయలుదేరాడు.






# ఎగువ కోరమండల్ తీరం

రచన: మీరానాయర్ ✦ చిత్రాలు: గోపకుమార్

చెన్నయ్ నగరం నుంచి ఉత్తరంగా పయనించామంటే మనం-దక్షిణాసియాలోని పెద్ద సరస్సులలో ఒకటైన **పులికాట్** సరస్సును చేరుకుంటాం. ఇది బంగాళాఖాత జలాలతో ఏర్పడిన విశాలమైన సరస్సు. ఈ సరస్సు తమిళనాడు - ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాల సరిహద్దు ప్రాంతంలో ఉన్నది. ఈ సరస్సులోని దీవులలో విరివిగా లభించే గవ్వలతో సున్నంతయారుచేస్తారు. ఈ సరస్సు రకరకాల పక్షులకు స్థావరంగా ఉంటున్నది. ఇక్కడ ఉన్న పక్షులే కాకుండా ఫ్లెమింగో వంటి పక్షులు దూరతీరాల నుంచి వలసవస్తూంటాయి. ఈ పక్షులను పరిరక్షించడానికి 1976వ సం॥లో


పులికాట్ సరస్సు

పక్షులశరణాలయం ఏర్పాటు చేశారు.

మనదేశంలో మొట్టమొదట డచ్‌వాళ్ళ వశమైన పట్టణాలలో ముఖ్యమైనది పులికాట్. ఈ సరస్సు అధికభాగం ఆంధ్రరాష్ట్రంలో ఉన్నది. ఆంధ్రప్రదేశ్ మన దేశంలో ఏర్పడిన మొట్టమొదటి భాషాప్రయుక్త రాష్ట్రం. ఇది మనదేశంలో వైశాల్యంలో ఐదవస్థానాన్ని అలంకరిస్తున్నది. వంకర టింకరగా చిన్న చిన్న కొండలతో చాలా పొడవైన సముద్రతీరం కలిగిన రాష్ట్రం ఆంధ్రప్రదేశ్. సముద్రతీర


సముద్రతీరంలోని మత్స్యకారుల గుడిసెలు

గ్రామాలూ, పట్టణాలూ తరచూ తుపాను తాకిడికి గురవుతూ ఉంటాయి.

పులికాట్ సరస్సుకు ఉత్తరంగా నెల్లూరు జిల్లాలో శ్రీహరికోట దీవి ఉన్నది. ఈ దీవిలోని అడవులలో ఇటీవలి కాలం వరకు వేట ప్రధాన జీవనోపాధిగా గల యానాదులు నివసించే వాళ్ళు. రెండు రాళ్ళ రాపిడితో నిప్పు పుట్టించడం ఈనాటికీ వాళ్ళలో కొందరికి తెలుసు. ఇక్కడ భారత అంతరిక్ష పరిశోధనాసంస్థ ప్రయోగశాల ఏర్పాటు చేయడంతో స్థానికులైన యానాదులను వేరు స్థలాలకు తరలించారు.


ప్రయోగించబడుతూన్న రాకెట్

శ్రీహరికోటలో భారత అంతరిక్ష పరిశోధనా సంస్థకు చెందిన అధునాతనమైన ప్రయోగశాల ఉన్నది. ఇక్కడి నుంచే మనదేశం మొట్టమొదటి 'సౌండింగ్ రాకెట్' రోహిణిని అంతరిక్షంలోకి ప్రయోగించింది. ఇంతవరకు ఈ కేంద్రం నుంచి దాదాపు 400 సౌండింగ్ రాకెట్లనూ, 11 ముఖ్యమైన శాటలైట్లనూ అంతరిక్షంలోకి ప్రయోగించారు. పరిమాణంలో ఇంకా పెద్ద రాకెట్లు ప్రయోగించడానికి అవసరమైన కొత్త 'లాంచింగ్ ప్యాడ్' నిర్మాణం



జరుగుతున్నది.

ఆంధ్రప్రదేశ్ అభ్రకపు (మైకా) గనులకు ప్రసిద్ధిగాంచింది. ఈ గనులు చాలావరకు నెల్లూరు జిల్లాలోనే ఉన్నాయి. అంతకన్నా నెల్లూరు జిల్లా వరిపొలాలలకు మరీ ప్రసిద్ధిగాంచింది.

ఆంధ్ర మహాభారతాన్ని రచించిన కవిత్రయంలో రెండవ వాడైన కవిబ్రహ్మ తిక్కన సోమయాజి విక్రమ సింహపురంగా ప్రసిద్ధిగాంచిన నెల్లూరుకు చెందినవాడే. కాకతీయ గణపతిరాజుకు సామంతుగా 12వ శతాబ్దంలో నెల్లూరును పరిపాలించిన మనుమసిద్ధి ఆస్థానకవి తిక్కన. ఆదికవి నన్నయభట్టు ప్రారంభించిన మహాభారతంలో తిక్కన పదిహేను పర్వాలు పూర్తి చేశాడు. మహాకవి తిక్కన మహాభారత రచన చేసిన స్థలం అని చెప్పుకునే చిన్న దేవాలయం ఇవాళ 'సిమెంటు గోడౌన్' గా ఉంటున్నది!

సముద్రతీర ఆంధ్ర ప్రాంతంలోనే జీవనదులైన కృష్ణ, గోదావరీ నదులు ప్రవహిస్తూన్న రెండు డెల్టాలు ఏర్పడ్డాయి. ఇవి దక్షిణ భారత ధాన్యాగారాలుగా ప్రసిద్ధిగాంచాయి.

కృష్ణానది పాయ ప్రవహించే తీరంలోనే కూచిపూడి గ్రామం వున్నది. ఈ గ్రామంలోనే సుప్రసిద్ధమైన కూచిపూడి నాట్య సంప్రదాయం రూపు దిద్దుకున్నది. 17వ శతాబ్ద ఉత్తరార్థంలో ఇక్కడ నివసించిన

సిద్ధేంద్రయోగి అనే వాగ్గేయకారుడు 'పారి జాతాపహరణం' అనే నృత్య నాటకం రచించాడు. శ్రీకృష్ణుడి పత్ని అయిన సత్యభామ, భర్తను పురికొల్పి, స్వర్గం నుంచి పారిజాత వృక్షాన్ని అపహరించి తెచ్చి తన పెరట్లో నాటడం – ఈనాటక ఇతివృత్తం. సిద్ధేంద్రయోగి కొందరు యువకులకు శిక్షణనిచ్చి, వాళ్ళ ద్వారా ఈ నాటకాన్ని ప్రదర్శించాడు. ఈ నృత్య నాటకం జనాదరణ పొందింది.

కళాపోషకుడైన గోల్కొండ కట్ట కడపటి పాలకుడు అబుల్ హసన్ తానీషా సమక్షంలో ఈ నాటకాన్ని ప్రద ర్శించినప్పుడు, దానిని చూసి ఆయన ముగ్ధుడై కూచిపూడి గ్రామాన్ని సిద్ధేంద్ర యోగికీ, ఆయన నాట్య బృందానికీ బహుమతిగా ఇచ్చాడు.



సుప్రసిద్ధ కూచిపూడి నాట్యాచార్యులు వెంపటి చిన్నసత్యం



రాధారెడ్డి – రాజారెడ్డి

సిద్ధేంద్రయోగి తన శిష్యులను చేర బిలిచి వాళ్ళూ, వాళ్ళ సంతతీ కూచిపూడి లోనే ఉండాలనీ, తమ కుటుంబంలో పుట్టే ప్రతియువకుడూ జీవితకాలంలో ఎప్పుడో ఒకప్పుడు కనీసం ఒక్కసారైనా 'భామాకలాప' నాటకంలో సత్యభామ పాత్రను పోషించాలనీ మాట పుచ్చుకు న్నాడు! సిద్ధేంద్రయోగి మనోవాంఛితానికి చిహ్నంగా ఈనాడు కూడా, ఈ గ్రామంలోని ప్రతియువకుడూ మొలచుట్టూ ఒక చిన్న గంటను కట్టుకుని ఉండడం విశేషం!

కాలక్రమేణా ఈనాటక ప్రక్రియలో చాలా మార్పులు వచ్చాయి. ఇవాళ ఇది పురుషులకు మాత్రమే పరిమితంకాదు. స్త్రీలు కూడా అద్భుతంగా ప్రదర్శనలిస్తూ కళాభిమానులను అలరిస్తున్నారు.

ప్రాచీన కాలంనుంచీ ముఖ్యమైన రేవుపట్టణంగా పేరుగాంచిన మచిలీపట్నం కృష్ణానది సమీపంలో ఉన్నది. ఇది 1680వ సం॥లో డచ్చివారికి బలమైన స్థావరంగా ఉండేది. 1750లో దీనిని ఫ్రెంచి వాళ్ళు పట్టుకున్నారు. ఆ తరవాత తొమ్మిదేళ్ళకు ఇది బ్రిటిష్‌వాళ్ళ హస్తగతమయింది. ఆంధ్ర ప్రాంతంలో బ్రిటిష్ వాళ్ళు తొలుత పట్టుకున్న ప్రాంతాలలో మచిలీపట్నం ముఖ్యమైనది. 1864వ సం॥నవంబర్ 1వ తేదీ వీచిన భయంకరమైన తుఫాను దెబ్బకు రేవు ఛిన్నాభిన్నమై అంతవరకు ఉన్న కీలకమైన

ప్రాముఖ్యతను కోల్పోయింది. ఈనాడు ఇక్కడ చిన్న ఓడరేవు ఉన్నది. కృష్ణాజిల్లా ప్రధాన ప్రభుత్వ కార్యాలయాలు కొన్ని ఇక్కడ ఉన్నాయి.

భారత స్వాతంత్ర్యోద్యమకాలంలో మచిలీపట్నం ముఖ్యమైన పాత్ర వహించింది. ప్రముఖ స్వాతంత్ర్య యోధుడు **గాడిచెర్ల హరిసర్వోత్తమ రావు** – స్వదేశీ ఉద్యమంలో భాగంగా యువకులకు ఆధునిక విద్యారంగంలో శిక్షణ ఇవ్వాలన్న లక్ష్యంతో **ఆంధ్ర జాతీయకళాశాలను** స్థాపించారు. మచిలీపట్నానికి చెందిన పింగళి వెంకయ్య – మన త్రివర్ణ జాతీయ పతాకానికి రూపకల్పన చేశారు!



పింగళి వెంకయ్య రూపకల్పన చేసిన మన త్రివర్ణజాతీయ పతాకం

బట్టలమీద అద్దకం చేసే కలంకారీ కళకు మచిలీపట్నం యావద్భారత ప్రసిద్ధి గాంచింది. దీనికి క్రీ.పూ.6వ శతాబ్ది నుంచి సుదీర్ఘ చరిత్ర ఉన్నదని చెబుతారు. పురాణ ఘట్టాలకు సంబంధించిన రకరకాల చిత్రాలను కలం లాంటి కుంచెలతో బట్టల మీద అద్దేవాళ్ళు. అందువల్లే దీనికి, కలంకారీ, అనే పేరు వచ్చింది. సంప్రదాయంగా వచ్చిన ఈ కలాల లకు బదులు ఇవాళ సౌలభ్యం కోసం కొయ్య బ్లాకులు ఉపయోగిస్తున్నారు.



# మనోహరుడి మొక్కుబడి

శివపురమనే గ్రామంలో మనోహరుడనే యువకుడుండేవాడు. వాడి చిన్నతనంలోనే ఒక పడవ ప్రమాదంలో తల్లీ, తండ్రీ మరణించారు. వాడి నాయనమ్మ వాణ్ణి చేరదీసి పెంచి పెద్ద చేసింది. అయితే, వాడికి చదువు అబ్బలేదు. కాయకష్టం అలవడలేదు. నాయనమ్మ పెట్టింది తిని, వసారాలో ఒక మూలగా మంచంమీద పడుకుని నిద్ర పోయేవాడు. మరి కాస్త వయసు పెరిగితే, గ్రామంలో ఎవరో ఒకరిదగ్గర పనికి కుదురుతాడని అవ్వ అనుకునేది. కాని, వాడికి పద్ధెనిమిదేళ్ళు నిండినా సోమరితనం మాత్రం వదల్లేదు.

క్రమంగా నాయనమ్మకు కంటి చూపు తగ్గి, మునుపటిలా రాట్నం వడకలేకపోవడంతో తిండికి కష్టమైంది. ఇది చూసిన గ్రామస్థులు మనోహరుణ్ణి గట్టిగా చీవాట్లు పెట్టి, ఎవరి దగ్గరైనా పనిలో చేరమన్నారు.

అయితే, వాడికి ఏంపని చేయాలో తోచలేదు. కట్టెలు కొట్టడం, పొలం దున్నడం, తోటపని ఇటువంటివి తలుచు కుంటేనే వాడికి గుండెలో దడపుట్టింది.

కష్టపడకుండా డబ్బు సంపాయించే మార్గాల గురించి, మనోహరుడు ఆలోచించసాగాడు. చివరికి వాడికి దొంగతన మొక్కటే అందుకు తగిన మార్గమని తోచింది. వాడు దొంగతనానికి తగిన పథకం వేయసాగాడు. కాని, పట్టుబడితే ఒళ్ళు చితక్కొడతారని భయపడ్డాడు. ఆలోచించగా, ఆలోచించగా వాడికి గ్రామదేవత శాంభవి జ్ఞాపకానికి వచ్చింది.

ఒక రాత్రివేళ వాడు నక్కుతూ గుడి చేరాడు. చుట్టుపక్కల ఎవరూలేరని తెలుసుకుని, వాడు అమ్మవారి విగ్రహాన్ని సమీపించి ముక్కుపుడక తీయబోతే, వాడిచేతులు ఒణికాయి. వాడు అమ్మవారికి భక్తితోమొక్కి

ఎన్. శివనాగేశ్వరరావు



"అమ్మా! నాయనమ్మ కోసం, మరొక మార్గం లేక ఈదొంగతనం చేస్తున్నాను. నేనెవరికీ పట్టుబడకుండా కరుణించు. ఈ ముక్కు పుడక ఖరీదులో సగం నీ హుండీలోవేస్తాను," అన్నాడు.

ఇలా చేశాక మనోహరుడికి ఎక్కడలేని ధైర్యంవచ్చింది. వాడు ముక్కుపుడక తీసుకుని జేబులో వేసుకుని, గుడినుంచి బయటికి వచ్చేశాడు.

మర్నాడు అమ్మవారి ముక్కుపుడక ఎవరోదొంగిలించారని గ్రామస్థులకు తెలిసి పోయింది. ఇంత అపచారానికి పాల్పడిన వాడెవడో, పెద్దరాటుతేలిన దొంగ అయివుం టాడని వాళ్ళు భావించారు. వాణ్ణి పట్టేందుకు గ్రామపెద్దలు అక్కడాఇక్కడా ఆరాలు తీయ సాగారు.

మనోహరుడు ఆఖరిక్షణంలో ధైర్యం కూడ గట్టుకుని దొంగతనం చేశాడే గాని, ఆ తర్వాతనుంచి వాడికి మనశ్శాంతి లేకుండా పోయింది. గ్రామంలో ఎవరు తనకేసిచూసినా, దూరంనుంచి గట్టిగా పిలిచినా, తన దొంగ తనం వాళ్ళకు తెలిసిపోయిందని బెదిరిపో సాగాడు.

వారంరోజులు గడిచాయి. ఎవరూ తనను అనుమానిస్తున్న సూచనలు కనబడలేదు. అప్పుడు వాడు ధైర్యం తెచ్చుకుని, ముక్కు పుడక ఎలా అమ్మడమా అని ఆలోచించడం ప్రారంభించాడు.

ముందుగా వాడు, ఆగ్రామంలోని శంభు లింగాచారి దుకాణానికిపోయి, అతడితో ఆ మాటా, ఈ మాటా మాట్లాడి, చివరకు,"లింగా చారీ, ఉట్టినే ఉబుసుపోక అడుగుతున్నాను, ఏమనుకోకు. ఏనాడైనా నువ్వు దొంగ వస్తు వులు కొనుగోలు చేశావా?" అని అడిగాడు.

ఆ మాటవింటూనేఆచారి,ముందున్న పట్టెడను సుత్తితో గట్టిగా కొట్టి, "ఇలాంటి నీచప్పనులు, మన పొరుగూరి నూకాలు చేస్తాడు! వాడు దొంగబంగారమే కాదు, చవగ్గా వస్తే, కొయ్యసామానైనా కొనేస్తాడు, చవటవెధవ!" అన్నాడు కోపంగా.

ఆచారి మాటలకు మనోహరుడు చిన్నగా నవ్వి, "ఏదో తమాషాకడుగుతున్నాను! ఒకవేళ అమ్మవారి ముక్కుపుడక దొంగిలించిన వాడు, నీదగ్గరకువచ్చి దాన్ని చవగ్గా అమ్ము తానంటే కొనవా?" అన్నాడు.

"కొనడంకాదు వాణ్ణిపట్టుకుని, ఈ సుత్తితో ఎడాపెడా మోది, రక్షకభటులకు అప్ప గిస్తాను. శంభులింగాచారంటే, నిజంగా శంభు

లింగాచారే, ఏమనుకున్నావో మరి!" అన్నాడు సుత్తినిదుకాణంలోఒకమూలగా విసిరివేస్తూ.

ఇది చూసి బెదిరిపోయిన మనోహరుడు తడబడుతున్న మాటలతో, "తమాషాకడు గుతున్నానని ముందే చెప్పాగదా! నీ నిజాయితీ సంగతి ఎరగని వాళ్ళెవరు? ఏమీ అనుకోకు," అంటూ అక్కడినుంచి ఇంటి దారిపట్టాడు.

మర్నాడు వాడు, అమ్మవారి ముక్కుపుడక పొరుగూరిలోని నూకాలుకు అమ్మదలచి బయల్దేరాడు. దారిలో వాడికి వీరప్ప అనే కాపలాభటుడు ఎదురుపడి, ఆగమన్నాడు. తన దొంగతనం బయటపడిందని వాడు అదిరిపడ్డాడు. అయితే, వీరప్ప జేబులోంచి చుట్ట ఒకటి తీస్తూ, "నా చెకుముకిరాయి అరిగి పోయింది. రవ్వపడడంలేదు. నీ దగ్గరుంటే ఇవ్వు!" అన్నాడు.

దానితో మనోహరుడికి ప్రాణం కుదుటపడి, "నాకు పొగతాగే అలవాటే లేదు," అన్నాడు. "నాకూ ఒకప్పుడు పొగతాగే అలవాటుండేది కాదు," అంటూ వీరప్ప ముందుకు సాగిపోయాడు.

మనోహరుడు నూకాలుండే ఊరుచేరి, అతడెక్కడుండేదీ ఎవర్నయినా అడిగి తెలుసుకుందామనుకునేంతలో, భటులు ఇద్దరు మనుషులను పట్టుకుని, చేతులకు సంకెళ్ళు వేసి తీసుకుపోతున్నారు.

మనోహరుడు దారేపోయేవాణ్ణొకణ్ణి, వాళ్ళెవరని అడిగాడు. దానికివాడు, "ఆ బుర్రమీసాలవాడు నూకాలు.రెండోవాడి పేరు తెలియదు. దొంగసొమ్ము కొన్నందుకు నూకాలునూ, దానిని అమ్మినందుకు రెండోవాణ్ణీ



భటులు ఖైదు చేయబోతున్నారు," అని చెప్పాడు.

ఇది వింటూనే మనోహరుడికి ముచ్చెమటలు పోసినై. జేబులోవున్న అమ్మవారి ముక్కుపుడక గుండ్రాయంత బరువుగా తోచింది. వాడికి దొంగతన మెంత ప్రాణాంతకమో అర్థమైంది.

వాడు అప్పటికప్పుడు తన గ్రామం చేరి, అమ్మవారికి సాగిలపడి మొక్కి, "తల్లీ! నేను దొంగతనం చేసిన మహాపాపిని, క్షమించు!" అని ముక్కుపుడక అమ్మవారి ముక్కుకు పెట్టి వచ్చేశాడు.

ఇది చేశాక మనోహరుడి మనసు తేలికపడింది. ఆరాత్రి హాయిగా నిద్రపట్ట బోతూండగా, వాడికొక ధర్మసందేహం కలిగింది: తను దొంగతనం చేసి పట్టుబడకపోతే,ముక్కు

పుడక ఖరీదులో సగం హుండీలో వేస్తానని మొక్కుకున్నాడు. ఆమె కనికరించబట్టే, తన దొంగతనం ఎవరికీ తెలియలేదు. తప్పు గ్రహించి ముక్కుపుడకను అమ్మవారికి ఇచ్చే శాడు. కానీ మొక్కుబడి ప్రకారం ముక్కు పుడక ఖరీదులో సగం హుండీలో వేయాలా? వేయనవసరంలేదా?

ఆ తెల్లవారి బాగా ఆలోచించిన మనో హరుడు, "ముక్కుపుడక అమ్మలేకపోవడం నా చేతగాని తనం. దానితో అమ్మవారికి సంబంధంలేదు. ముక్కపుడకనుతిరిగిఆమెకు ఇచ్చినా మొక్కుబడి ప్రకారం, దానిఖరీదులో సగం హుండీలో వేయడం ధర్మమవుతుంది!" అనుకున్నాడు.

తన మొక్కుబడి మాట నిలుపుకోవా లంటే, తను కష్టపడి పనిచేయక తప్పదని నిర్ణయానికి వచ్చాడు, మనోహరుడు. వాడు గ్రామంలోని పెద్దరైతు ఘంటయ్యను కలుసు కుని, "అయ్యా! ఏదైనా పని ఇప్పించండి. మీకు తృప్తి కలిగేలా చేయగలను," అన్నాడు.

మనోహరుడి సోమరితనం ఎరిగిన ఘంటయ్య మొదట్లో ఒప్పుకోలేదు. కానీ వాడు కాళ్ళా వేళ్ళా పడడంతో, పొలంలో ఏతాంతో నీళ్ళుతోడే పని అప్పచెప్పాడు. మనమడిలో వచ్చిన మార్పుకు, వాడి నాయ నమ్మ చాలా సంతోషించింది. ఘంటయ్య కూడా వాడి పనితనం, కష్టించి పనిచేసే స్వభావం చూసి చాలా తృప్తిపడ్డాడు.

ఇలా మూడు నెలలు పనిచేసి మనోహ రుడు ఘంటయ్య ఇచ్చిన జీతం డబ్బులోసగం తీసుకుపోయి, అమ్మవారిగుడి హుండీలో వేసి, తన మొక్కుబడి తీర్చుకున్నాడు.

మరొక నెల గడిచాక ఘంటయ్య, మనో హరుణ్ణి పిలిచి, "ఒరే, నీది ఒళ్ళుదాచు కోకుండా కష్టించి పనిచేసే స్వభావమని తెలుసుకున్నాను. ఇక నిన్ను, ఆ ఏతాం తోడే పనిమానిపించి, నా పాలేర్లలో చేరు స్తున్నాను. ఇక ఈ నెల నుంచి నీ జీతం రెండింతలు చేయబోతున్నాను," అన్నాడు.

దీనికి మనోహరుడు పరమానందం చెందాడు. తన సోమరితనం వదలడానికీ, దొంగఅయ్యే పరిస్థితి తప్పడానికీ, యజమాని తనను మెచ్చుకోవడానికీ వీటన్నిటికీ మూల కారణం అమ్మవారి కరుణాకటాక్షలేనని వాడు మనసులోనే ఆమెకు కృతజ్ఞత చెప్పు కుని నమస్కరించుకున్నాడు.





# బంగారు గడియలు

*1. .... **600** పైచిలుకు కుడ్య చిత్రాలు గల **17,000** సంవత్స రాలనాటి గుహలు ఎక్కడున్నాయి?*
ఈ గుహలలో 'హాల్ ఆఫ్ బుల్స్' (వృషభమంటపం) అనే బ్రహ్మాం డమైన భాగం చాలా ముఖ్య మైనది.



## 13 ప్రపంచంలో వీటిని మనం ఎక్కడ చూడగలం?



*2. .... తొమ్మిది అంతస్థులు గల ఈ స్తంభాన్ని రాజపుత్ర పాలకుడు రాణా కుంభ క్రీ.శ. **1440**వ సం॥లో నిర్మించాడు. ఇది ఎక్కడ ఉన్నది?*
విజయస్తంభంగా ప్రసిద్ధిగాంచిన దీని ఎత్తు 36మీ॥.



*3. .... అధికాలో మంచు కప్పబడిన పర్వతం ఎక్కడ ఉన్నది?*
ఇది భూమధ్యరేఖ ఉష్ణప్రాంతంలో ఉన్నప్పటికీ, ఈపర్వత సానువులు మంచు కప్పబడి ఉంటాయి.

*4. .... 'జిరాఫే' స్త్రీలు ఎక్కడున్నారు?*
పడావుంగ్ తెగకు చెందిన ఈ స్త్రీలు మూడేళ్ళ వయసు నుంచే మెడచుట్టూ రాగి వలయాలు ధరిస్తారు. పెరిగే కొద్దీ రాగివలయాల సంఖ్య ఎక్కువవుతూ ఉంటుంది. ఈ రాగి వలయాలు మెడ పొడవును పెంచుతాయి. పొడవైన మెడను అక్కడ అందంగా భావిస్తారు.



***5. .... 860 కి.మీ పొడవుగల బీరువాలలో, అర లలో, దాదాపు 2 కోట్ల పుస్తకాలు గల గ్రంథాలయం...?***
మూడు భవనాలలో ఏర్పాటు చేయబడివున్న ఈ 'లైబ్రరీ ఆఫ్ కాంగ్రెస్'లో 40 లక్షల దేశ పటాలూ, 90 లక్షల ఛాయా చిత్రాలూ 13లక్షల ఆడియో రికార్డులూ ఉన్నాయి.



# అడవి వీరుడు

**చిత్రప్రహేళిక**

ఆఫ్రికా అడవులలో ఆదిమ మానవుడు చెట్ల కొమ్మలపై నుంచి కొమ్మలకు దాటుతూ పులిని హడల కొడుతున్నాడు. అయినా, ఈ చిత్రంలో ఒక పొరబాటు దొర్లింది. పరిశీలించి చూసి అదేమిటో పట్టుకోగలరా?

## పిక్చర్ క్విజ్

ఇక్కడ తొమ్మిది దేశాల చిత్రపటాలు ఉన్నాయి. అయితే వాటి పేర్లు తారుమారై ఉన్నాయి. వాటిని సరైన స్థానాలలో అమర్చగలరా?





## సరదా ప్రశ్నలు

1. రెండూ కలిపితే 55 పైసలు వచ్చే రెండు నాణాలు నాదగ్గర ఉన్నాయి. వాటిలో ఒకటి 50పైసల నాణెం కాదు. మరి ఆ రెండు నాణాలు ఏవి?

2. చిలుకలు అమ్మేవాడు "ఈ చిలుక వినే ప్రతి మాటనూ తిప్పి పలుకుతుంది," అని చెప్పాడు. అతని మాట విని ఒక పెద్దమనిషి చిలుకను కొని దానికి మాటలు నేర్పడానికి ప్రయత్నించాడు. కాని అది ఒక్క మాటను కూడా తిప్పి చెప్పలేకపోయింది. అయినప్పటికీ చిలుకలు అమ్మేవాడు అబద్ధం చెప్పలేదు. అది ఎలా సాధ్యమయిందో చెప్పగలరా?



3. రామం దంపతులకు ముగ్గురు కుమార్తెలూ, ప్రతి కుమార్తెకు ఒక సోదరుడు ఉన్నాడు. మొత్తం మీద ఆ కుటుంబంలో ఎంతమంది ఉన్నారు?

4. గ్రీన్‌ల్యాండ్ కనుగొనడానికి ముందు అతి పెద్ద ద్వీపం ఏది?

5. సినిమాకు ఒక మిత్రుణ్ణి రెండు సార్లు తీసుకెళ్ళడం లేదా, ఇద్దరు మిత్రుల్ని ఒకేసారి తీసుకెళ్ళడం ఈ రెండింటిలో ఏది ఖర్చు తక్కువ?



6. ఒక పెట్టెలో 5 ఆపిల్ పళ్ళు ఉన్నాయి. వాటిని ఐదుగురు అమ్మాయిలకు తలా ఒకటి వచ్చేలా పంచాలి. అయితే ఒక ఆపిల్ పెట్టెలోనే ఉండాలి. ఇది ఎలా సాధ్యం?

7. 'నిజంచెప్పేవాళ్ళు' 'అబద్ధాలాడేవాళ్ళు' - పార్టీ జరుగుతున్నది. అక్కడొక మనిషి మీతో – ఇప్పుడే తానొక అబద్ధాల కోరు అని ఒక అమ్మాయి చెప్పడం విన్నాను, అని చెప్పాడు. మరి ఆ మనిషి నిజం చెప్పే వాడా? అబద్ధాలాడేవాడా?

8. సైన్యంలో అతిపెద్ద 'బూట్లు' ఎవరికి ఉంటాయి?

### చేసి చూడండి

## పూల కుండీ

**కావలసిన వస్తువులు:**
ఖాళీసీసా, కోడిగుడ్ల పెంకు, జిగురు, రంగు.

**తయారు చేసే విధానం:**
ఎ) కోడిగుడ్ల పెంకులను, సబ్బు నీళ్ళతో శుభ్రంగాకడుక్కోండి.
బి) వాటిని చిన్న చిన్న ముక్కలుగా చేసుకోండి.
సి) ఒక్కొక్క ముక్కనూ జిగురుతో సీసామీద అతికించండి.
డి) గుడ్డు పెంకుల మీద కాంతివంతమైన వివిధ రంగులను అద్దండి. అందమైన పూలకుండీ సిద్ధమవుతుంది.



ఎలుక కోసం
కాచుక్కూర్చున్న
పిల్లి







ఆకలితో
అలమటిస్తూన్న
పక్షిపిల్ల

## బంగారు గడియలు - **12** సమాధానాలు

### ప్రపంచంలో ఎక్కడ?

1. దక్షిణ అమెరికాలో ఈక్వడార్‌కు ఆవలనున్న గాలవగోస్ దీవులు.
2. వాటికన్ సిటీ,
3. పెరూ – బొలీవియా సరిహద్దులోని టిటికాకా సరస్సు.
4. ఆస్ట్రేలియాలోని సిడ్నీ హార్బర్ మీదుగా.
5. రాజస్థాన్‌లోని దేష్‌వాక్.

### కథాప్రహేళిక

అయన బట్టలు తీసేసి నీళ్ళలోకి దిగాడు. అలాంటప్పుడు బిస్కట్లు తీసి జేబులను ఎలా నింపుకోగలడు?

### సరదా ప్రశ్నలు!

1. దానిమీద రౌతు ఉన్నప్పుడు.
2. త్రాసు ముల్లు పాడైనప్పుడు.
3. పేజీని తల్లకిందులుగా తిప్పండి!
4. పాములకు కనురెప్పలు లేవు. కాబట్టి కళ్ళుమూసుకోలేవు.
5. అవి రెండు ఉన్నప్పుడు.
6. గడియారం!
7. సీసా!
8. నిజంకాదు. సైనికుడికి ఉన్నది ఒకే చెయ్యి. కాబట్టి ఒర నుంచి కత్తిలాగి రెండవ చేతిని తెగనరుక్కోవడం సాధ్యం కాదు.




పాండవులు సైంధవుణ్ణి పరాభవించి పంపేసి, కామ్యకవనంలో ఉంటూ ఉండగా, మార్కండేయుడు వచ్చాడు. ధర్మరాజు ఆయనతో తాము పడుతున్న కష్టాలూ, తమతోపాటు ద్రౌపది పడుతున్న పాట్లూ చెప్పి, "మహాత్మా, పూర్వం ఏ పతివ్రత అయినా ద్రౌపదిలాగా కష్టాలు పడిందా?" అని అడిగాడు.

అప్పుడు మార్కండేయుడు పాండవులకు సావిత్రి కథ ఇలా చెప్పాడు:

పూర్వం మద్రదేశాన్ని అశ్వపతి అనే ధర్మాత్ముడు పాలించాడు. ఆయనకు సంతానం లేదు. అందుచేత ఆయన కఠిన నియమాలతో సావిత్రీ దేవతను ఉపాసించుతూ, హోమాలు చేశాడు. చివరకు హోమకుండంలో సావిత్రీదేవి ప్రత్యక్షమై ఏమి కావాలని అడిగింది. అశ్వపతి, సావిత్రీదేవికి చేతులు జోడించి భక్తితో నమస్కరించి, "దేవీ, వంశోద్ధారకులైన కొడుకులు కావాలి," అన్నాడు.

"రాజా, నీ కోరిక తెలిసి, నేను ముందుగానే బ్రహ్మను అడిగాను. ఆయన నీకు ఒక కూతుర్ని ఇవ్వటానికి మాత్రమే సమ్మతించాడు. కనక నువ్వు అదే మహాప్రసాదంగా భావించి, తృప్తిపడు," అని చెప్పి సావిత్రీదేవి అదృశ్యమయింది.

అశ్వపతి తపస్సు చాలించి, నగరానికి తిరిగివచ్చి, యథాప్రకారం రాజ్యం చేస్తూ ఉండగా, ఆయన భార్య మాళవి గర్భవతి అయి, ఒక శుభముహూర్తాన చక్కని ఆడపిల్లను కన్నది. అశ్వపతి జాతక కర్మలు జరిపించి, ఆమెకు సావిత్రి అని నామకరణం చేశాడు.

సావిత్రి ఎంతో గారాబంగా పెరుగుతూ, నానాటికీ అందంలో మించిపోతూ, చూసేవారికి ఏ దేవతాస్త్రీయో, సావిత్రీదేవే స్వయంగా

**36. సావిత్రీ సత్యవంతుల కథ**



మనిషి జన్మ ఎత్తిందేమోనని భ్రమ కలిగే టట్టుగా తయారయింది.

ఒకనాడు అశ్వపతి ఆమెతో, "అమ్మా, నీకు పెళ్ళియీడు వచ్చింది. ఏ కారణం చేతనో రాజకుమారుడు ఒక్కడు కూడా నిన్ను పెళ్ళాడతానని రావటం లేదు. నీకు తగిన భర్తను నువ్వయినా వరించి నాకు చెప్పు. నేను నిన్ను అతనికి ఇచ్చి నాధర్మం నెరవేర్చుకుంటాను," అన్నాడు.

సావిత్రి తన భర్త కాదగిన వాడికోసం వెతుకుతూ రథమెక్కి రాజర్షులుండే ఆశ్ర మాల వెంబడి బయలుదేరింది.

సావిత్రి అలా తిరుగుతూ ఉండగా ఒకనాడు అశ్వపతి వద్దకు నారద మహా మునివచ్చి, లోకవార్తలు చెప్పనారంభిం చాడు. నారదుడు ఉండగానే సావిత్రి తన పర్యటన పూర్తి చేసుకుని, ఇంటికి తిరిగి వచ్చింది. ఆమె తన తండ్రికీ, నారదుడికీ నమస్కరించి నిలబడేసరికి నారదుడు అశ్వపతితో, "రాజా, నీ కూతురు ఎక్కడికి వెళ్ళి వస్తున్నది? యుక్త వయస్కురాలైన ఈ పిల్లకు ఇంకా వివాహం చేశావుకావేం?" అని అడిగాడు.

"మునీంద్రా, ఈమెను భర్తను వెతుక్కు రమ్మని పంపాను. ఎవరిని వరించి వచ్చిందో అడిగి తెలుసుకోవాలి," అంటూ అశ్వపతి తన కూతురితో, "అమ్మా, నువ్వు వెళ్ళినపని అయిందా?" అన్నాడు.

సావిత్రి తండ్రితో ఇలా అన్నది:

"చాలా కాలంగా సాళ్వదేశాన్ని ఏలిన ద్యుమత్సేనుడనే మహారాజుకు వార్ధక్యంలో ఒక కొడుకు పుట్టాడు. ద్యుమత్సేనుడికి దురదృష్టవశాన గుడ్డితనం సంప్రాప్తమయింది. అది ఆధారం చేసుకుని, ద్యుమత్సేనుడికి పూర్వం ఓడిన శత్రువులు ఆయన రాజ్యాన్ని కాజేశారు. ఆ ముసలిరాజు తన ముసలి భార్యనూ, పసికొడుకునూ వెంటబెట్టుకుని అరణ్యాలలో ఉంటూ తపస్సు చేసుకుంటు న్నాడు. పసితనం నుంచీ ఆశ్రమాలలో పెరిగిన ద్యుమత్సేనుడి కొడుకు మునికుమా రుడి లాగా పెరిగి, క్రూరబుద్ధి ఏమాత్రమూ లేక, ఎప్పుడూ నిజం చెబుతూ, సత్యవంతు డని పేరు తెచ్చుకున్నాడు. నేను ఆ సత్యవంతుణ్ణి నా భర్తగా వరించి తిరిగి వచ్చాను."

ఈ మాట వినగానే నారదుడు, "అయ్యో, పాపం! సావిత్రి తెలియక ఆ కుర్రవాణ్ణి భర్తగా వరించింది," అన్నాడు.

అప్పుడు అశ్వపతి, "మునీశ్వరా, మీకు తెలియనిదంటూ లేదు. ఈ సత్యవంతుడు ఎలాటివాడు? అతని గుణమూ, రూపమూ, శీలమూ ఎలాటివి?" అని అడిగాడు.

దానికి నారదుడు, "రాజా, ద్యుమత్సేనుడి కొడుకు తన తల్లిదండ్రులలాగే సత్యవ్రతుడు. అతను గుర్రాలబొమ్మలు చాలా బాగా తయారుచేస్తాడు. అందుచేత అతన్ని చిత్రాశ్వుడని కూడా పిలుస్తారు. అతని అందచందాలు అశ్వినీదేవతలకు తీసిపోవు. సకల సద్గుణ సంపన్నుడు. కాని అతని ఆయువు ఇంకొక్క ఏడాది మాత్రమే ఉన్నది. ఇవాళ నుంచి సరిగా ఏడాది గడిచేసరికి అతని జీవితం ముగిసిపోతుంది," అన్నాడు.

ఈ మాటకు అశ్వపతి కలతపడి, "అమ్మా, ఈ అల్పాయుష్కుణ్ణి విడిచి మరెవరినైనా వరించు," అన్నాడు.

"ఒకసారి త్రికరణశుద్ధిగా ఒకరిని వరించిన తరవాత, అతను అల్పాయువైనా, దీర్ఘాయువైనా, శీలవంతుడైనా, దుశ్శీలుడైనా మరొకరిని వరించటం సాధ్యం కాదు. నేను సత్యవంతుణ్ణి వదిలేసి మరొకరిని వరించను. నన్ను అతనికే ఇచ్చి పెళ్ళిచెయ్యి," అన్నది సావిత్రి తండ్రితో.

నారదుడు కూడా అశ్వపతితో, "రాజా, నీ కుమార్తె దృఢనిశ్చయం గలది. ఆమె మనసు మార్చటం నీవల్ల కాదు. నన్నడిగితే ఈనాటి రాజులలో సత్యవంతుడికి సమానమని చెప్పగలవాడు ఎవడూలేడు. సావిత్రిని అతనికిచ్చి చెయ్యి. ఆమె సుకృతం మంచిదైతే సత్యవంతుడు దీర్ఘాయువుకావచ్చు. శుభమస్తు!" అనిచెప్పి స్వర్గానికి వెళ్ళిపోయాడు.



నారదుడు చెప్పినప్రకారం అశ్వపతి తన కుమార్తెను సత్యవంతుడికిచ్చి పెళ్ళి చేయ నిశ్చయించి, సావిత్రిని వెంటబెట్టుకుని బంధుమిత్ర పరివార సహితంగా ద్యుమత్సేనుడి ఆశ్రమానికి వెళ్ళాడు.

ముసలివాడూ, చూపులేనివాడూ అయిన ద్యుమత్సేనుడు ఒక మద్దిచెట్టు నీడన కూర్చుని ఉన్నాడు. అశ్వపతి ఆయనను సమీపించి, "మహారాజా, నా కుమార్తె సావిత్రిని నీ కుమారుడికిచ్చి పెళ్ళిచేయ నిశ్చయించి వచ్చాను. ఈమెను నీ కోడలుగా స్వీకరించు," అన్నాడు.

"రాజా, మేము రాజ్యం పోగొట్టుకుని, ఈ అరణ్యంలో జీవిస్తున్నాము. నీ కుమార్తె సుకుమారి, మాతో కష్టాలు పడగలదా?" అన్నాడు ద్యుమత్సేనుడు.



"సుఖ దుఃఖాలు మనిషి అధీనంలో ఉండేవి కావు. ఆ మాట నా కుమార్తెకు తెలుసు. కష్ట సుఖాలను గురించి బాగా ఆలోచించే ఇక్కడికి వచ్చాము. నా కూతురూ, నీ కొడుకూ ఒకరికొకరు అన్నివిధాలా తగిన వారు. మనం వియ్యమందుదాం," అని అశ్వపతి అన్నాడు.

ద్యుమత్సేనుడు సంతోషించి, తన ఆశ్ర మంలో ఉన్న మునులందరినీ చేర బిలిచి, మంచి ముహూర్తంలో సావిత్రీ సత్యవంతుల వివాహం జరిపించాడు. అశ్వపతి తన నగ రానికి తిరిగి వెళ్ళాడు.

తన తండ్రి వెళ్ళగానే సావిత్రి తన మేలి వస్త్రాలూ,ఆభరణాలూ తీసేసి, భర్తతో బాటు తాను కూడా నారచీరలు కట్టి, శరీర శ్రమ లక్ష్యపెట్టకుండా అత్తమామలకూ, భర్తకూ అన్నివిధాలా సేవలు చేస్తూ, మితభాషిణి అయి కాలంగడపసాగింది.

కాని ఆమె తన భర్త ఆయుఌవు ఒక్కొక్క రోజే తరిగిపోవటం లెక్క పెడుతూనే ఉన్నది. నారదుడు చెప్పిన ప్రకారం సత్యవంతుడి ఆయుర్దాయం ఇంకా నాలుగు రోజులు ఉన్నదనగా ఆమె త్రిరాత్రోపవాసం ప్రారం భించింది.

"అమ్మా, అసలే సుకుమారివి. ఇలాటి వ్రతం ఎందుకు ప్రారంభించావు? నిన్నీ కఠోరవ్రతం మానమనటానికి నాకు నోరు రాకుండా ఉన్నది," అని ద్యుమత్సేనుడు సావిత్రితో అన్నాడు.

"దృఢనిశ్చయం ఉండాలే గాని, ఎంత కఠినమైన పనులైనా నిర్విఘ్నంగా సాధించ వచ్చు. నేను దృఢనిశ్చయంతోనే ఈ వ్రతం ప్రారంభించాను," అన్నది సావిత్రి.

సావిత్రికి ఉపవాసశ్రమ కన్న తన భర్తకు చావు రానున్నదన్న దిగులు జాస్తి అయింది. మూడు రాత్రులూ గడిచాయి. నారదుడు చెప్పిన ప్రకారం సత్యవంతుడి జీవితంలో ఆఖరు రోజు తెల్లవారింది.

ఆ రోజు సావిత్రి తెల్లవారుతూనే లేచి, సూర్యోదయంకాగానే అగ్ని ప్రజ్వలింపజేసి, హోమంచేసి, ఆశ్రమంలో ఉన్న అత్తమామ లకూ, మిగిలిన పెద్దలకూ నమస్కారాలు చేసి, "దీర్ఘసుమంగళీ భవ!" అని ఆశీస్సులు పొంది, భర్తకు రాబోయే మరణం గురించి ఆలోచిస్తూ దిగులుగా కూర్చున్నది.

"అమ్మా, నీ వ్రతం పూర్తి అయింది గదా, పారణచెయ్యవేం?" అని అత్తమామలు సావిత్రిని అడిగారు.

"ఈ వ్రతానికి సూర్యాస్తమయం అయిన తరవాతనే పారణ చెయ్యాలి," అని సావిత్రి బదులు చెప్పింది.

సత్యవంతుడు సమిథలనూ, పూలనూ, పళ్ళనూ తీసుకురావటానికి గొడ్డలి భుజాన పెట్టుకుని, అరణ్యంలోకి బయలుదేరుతు న్నాడు. అప్పుడు సావిత్రి అతన్ని సమీపించి, "నేనూ వస్తాను. ఇవాళ నిన్ను విడిచి ఉండ బుద్ధికావటం లేదు," అన్నది.

"పిచ్చిదానా, అడవి ఎలా ఉంటుందో నీకు తెలీదు. అక్కడి బాటలనిండా రాళ్ళూ, ముళ్ళూ ఉంటాయి. అదీగాక మూడు రోజు లుగా ఉపవాసం ఉండి బడలి ఉన్నావు," అన్నాడు సత్యవంతుడు.

"ఉపవాసంచేత నా కేమీ బడలిక లేదు. ఎందుకో నా కివాళ అరణ్యంలో తిరగాలని పించింది. అభ్యంతరం చెప్పవద్దు," అన్నది సావిత్రి.

"నీఇష్టం.కాని మా అమ్మా, నాన్నా ఒప్పు కుంటే అలాగే నా వెంట రా. తప్పు నా మీద ఉండదు," అన్నాడు, సత్యవంతుడు.

సావిత్రి మామగారికి తన కోరిక తెలిపింది. "నేను వచ్చి దాదాపు సంవత్సరం కావస్తున్నది. అరణ్యం చూడాలన్న నా కోరిక తీరలేదు. ఇవాళ నన్ను నా భర్త వెంట వెళ్ళనివ్వండి.," అని ఆమెఅడిగింది.ఎన్నడూ ఏ కోరికా కోరి నది కాదు గదా అని,ద్యుమత్సేనుడు సావి త్రిని సత్యవంతుడి వెంట వెళ్ళమన్నాడు.

అత్తమామల అనుమతితో సావిత్రి, కడు పులో పుట్టెడు దిగులుఉన్నా, పైకి ఎంతో ఉల్లాసంగాకనబడుతూ, సత్యవంతుడి వెంట అరణ్యంలోకి బయలుదేరింది. సత్యవంతుడు



అరణ్యంలోని అందాలను చూపుతూ నడుస్తూ ఉంటే సావిత్రికి అతను అప్పుడే చచ్చిపోయి నట్టే అనిపించ సాగింది.

సత్యవంతుడు బుట్టనిండా పూలూ, పళ్ళూ కోసి, కట్టెలు కొట్టటం ప్రారంభించాడు. అతనికి కొద్దిసేపట్లో ఆయాసం వచ్చింది. ఒళ్ళంతా చెమటలు పట్టాయి. అతను గొడ్డలి అవతలపడేసి, సావిత్రి దగ్గరికివచ్చి, "తల పగిలిపోతున్నది. శరీరం తూలుతున్నది. నిలబడలేకుండా ఉన్నాను. కాస్సేపు పడు కుంటాను," అన్నాడు.

సావిత్రి అతని తల పెట్టుకోవటానికితన తొడ ఇచ్చి, పడుకోనిచ్చింది. కొంత సేపటికి సత్యవంతుడి సమీపంలో సావిత్రికి ఒక ఆకారం కనబడింది. ఆ వ్యక్తి నల్లగా,ఎర్రని కళ్ళు కలిగి, నీలవస్త్రాలు ధరించి, చేతిలో

పాశం పట్టుకుని, చూడటానికి భయంక రుడుగా ఉన్నాడు.

అతన్ని చూస్తూనే సత్యవంతుడి తలను తన తొడమీది నుంచి తీసి కిందపెట్టి, లేచి నిలబడి, నమస్కారంచేసి, "అయ్యా, నువ్వు ఎవరు? ఎందుకు వచ్చావు?" అని అడిగింది సావిత్రి.

"అమ్మా, నేను యముణ్ణి, నువ్వు పతి వ్రతవుగనక నన్ను చూడ గలిగావు. సత్యవం తుడికి ఆయువు ముగిసింది. అతను గొప్ప ధార్మికుడు గనక అతని కోసం దూతలను పంపక, నేనే స్వయంగా వచ్చాను," అంటూ యముడు తన పాశంతో సత్యవంతుడి శరీరంనుంచి బొటనవేలి ప్రమాణంలో ఉన్న జీవుణ్ణిలాగి, దక్షిణంగా బయలుదేరాడు.

సావిత్రి తన భర్త శరీరాన్ని భద్రపరచి, యముడి వెంట బయలుదేరింది. యము డామెను తిరిగిపొమ్మన్నాడు. కాని సావిత్రి తనభర్త ఎక్కడికి పోతే తానుకూడా అక్కడికి పోతానన్నది, అది తన ధర్మమన్నదీ.

యముడు సంతోషించి సావిత్రితో, "నీ భర్త ప్రాణాలు తప్ప మరేదన్నా వరంకోరుకో," అన్నాడు.

"మామగారు ముసలివాడూ, గుడ్డివాడూ అయ్యాడు. ఆయనకు చూపూ, శరీరబలమూ ప్రసాదించు," అన్నది సావిత్రి. యముడు సరేనన్నాడు.

కాని సావిత్రి యముణ్ణి అనుసరించటం మానలేదు. ఆమెను వదిలించుకోవటానికి యముడు ఆమెను మరొక వరం కోరుకో మన్నాడు.

సావిత్రి రాజ్యం కోల్పోయిన తన మామ గారికి తిరిగి రాజ్యప్రాప్తి కలగాలని వరం కోరింది. యముడు సరేనన్నాడు.

అప్పటికీ ఆమె యముడి వెంట పోవటం మానలేదు. యముడు ఆమెను మరొకవరం



కోరమన్నాడు. సావిత్రి తన తండ్రికి పుత్ర సంతానం కోరింది. యముడు అశ్వపతికి నూరుగురు కొడుకులు కలిగేలాగు వరం ఇచ్చాడు. అయినా సావిత్రి తిరిగి పోవటం లేదని గమనించి యముడు ఆమెకు నాలుగో వరం ఇస్తానన్నాడు. సావిత్రి తనకూ, సత్య వంతుడికీ వంశవృద్ధి అయ్యేటట్టు నూరుగురు కొడుకులను ప్రసాదించమన్నది.

"నీకు నూరుగురు కొడుకులు పుడతారు. ఇక తిరిగి వెళ్ళు," అన్నాడు యముడు.

"అలా అయితే నా భర్త ప్రాణాలు తిరిగి ఇచ్చెయ్యి," అన్నది సావిత్రి.

యముడు సత్యవంతుడి ప్రాణాలు వది లేసివెళ్ళిపోయాడు. సావిత్రి తన భర్త శరీరం ఉన్నచోటుకు తిరిగి వచ్చి, అతని తలను తన తొడల మీద పెట్టుకుని కూర్చున్నది. కొంతసేపటికి సత్యవంతుడు కళ్ళు తెరిచి సావిత్రి ముఖంలోకి చూసి, "నేను చాలాసేపు నిద్రపోయానా? నన్నెవరో నల్లనివాడు చాలా దూరం తీసుకుపోయినట్టు కల వచ్చింది," అన్నాడు.

"అదంతా తరవాత చెబుతాను. పొద్దు గ్రూకి చీకటిపడుతున్నది. నువ్వులేచి నడవ గలిగితే మనం ఆశ్రమానికి పోదాం," అని సావిత్రి అన్నది.

అతన్ని సావిత్రి లేపి నిలబెట్టవలిసి వచ్చింది. బుట్టనుమోసే శక్తి అతనికి లేదు. దాన్ని ఒక చెట్టుకొమ్మకు తగిలించి, సావిత్రి మెల్లగా అతన్ని నడిపించుకుంటూ, వెన్నెలలో దారి చూసుకుంటూ ఆశ్రమానికి చేర్చింది.

ఆశ్రమంలో ఆకస్మికంగా చూపు వచ్చిన ద్యుమత్సేనుడు, చీకటిపడినా కొడుకూ కోడలూ తిరిగిరానందున ఆందోళనపడి తనభార్యతోసహా, కొడుకు కోడళ్ళను పేరెత్తి పిలుస్తూ, అరణ్యం కేసి బయలుదేరాడు. ఇంతలో సావిత్రీసత్యవంతులు రానే వచ్చారు. ఈసరికే ఆశ్రమంలో అనేక మంది చేరారు. సావిత్రి వారందరికీ జరిగినదంతా చెప్పింది.

యముడి వరాలు వృథా కాలేదు. ద్యుమ త్సేనుడికి రాజ్యం తిరిగి వచ్చింది. అశ్వపతికి కొడుకులుకలిగారు. సావిత్రీ సత్యవంతులకు కూడా కొడుకులు పుట్టారు.

మార్కండేయుడు పాండవులకు ఈకథ చెప్పి, "ద్రౌపది పాతివ్రత్యంవల్ల మీ కష్టాలు తొలగిపోతాయి," అని చెప్పి, తన దారిన తాను వెళ్ళాడు.



# చందమామ కబుర్లు

## భిన్నమైన నూతన సంవత్సరం!

ప్రపంచం బ్రహ్మసృష్టి అని హిందువుల విశ్వాసం. మన పూర్వులు కాలగమనాన్ని కృతయుగం, త్రేతాయుగం, ద్వాపరయుగం, కలియుగం అని నాలుగు యుగాలుగా విభజించారు. ప్రస్తుతం కలియుగం నాలుగవ పాదంలో 5,097 సం॥లు గడిచాయనీ, ఇంకా 4,32,000 సంవత్సరాలకు యుగాంతమవుతుందనీ ఒక విశ్వాసం. ఈ విశ్వం సృష్టి జరిగి 1,955, 885, 097 సంవత్సరాలయ్యాయని ఒక అంచనా! మనదేశంలో చాలా ప్రాంతాలలో ఏప్రిల్ 8వ తేదీ నూతన సంవత్సరం (ఉగాది) ఆరంభమయింది. ఆరు రోజుల తరవాత ఏప్రిల్ 14వ తేదీ– బెంగాల్, అస్సాం, తమిళనాడు, కేరళ ప్రాంతాల ప్రజలకు కొత్త సంవత్సరం ఆరంభమయింది!

## ఏకాంత దినం!

ఇండోనేసియా బాలీదీవిలో హిందువులే అధిక సంఖ్యాకులు. అక్కడ యేటా ఏప్రిల్ 9వ తేదీ ఏకాంత దినం జరుపుకుంటారు. ఆ రోజు ఎవరూ ఇళ్ళ నుంచి వెలుపలికి రారు. లైట్లు తీసేస్తారు. ప్రయాణాలు పెట్టుకోరు. ఎటువంటి వినోద కార్యక్రమాలూ ఉండవు. ప్రత్యేక అనుమతి పొందిన వాహనాలు తప్ప రోడ్ల మీద ఎలాంటి రాకపోకలూ ఉండవు. సాధారణంగా పర్యాటకుల రాకపోకలతో ఎప్పుడూ హడావుడిగా ఉండే ఆ దీవిని దాదాపు 20 గంటల సేపు నిశ్శబ్దం ఆవరిస్తుంది!

## బంగారంతో స్టాంపు

ఇండోనేసియా ప్రెసిడెంట్ సుహార్తో సతీమణి సితీ హర్తీనా యేడాది క్రితం మరణించింది. ఏప్రిల్ 28వ తేదీ జరిగిన ఆమె వర్ధంతి సందర్భంగా, ఆమె గౌరవార్థం ఇండోనేసియా తపాలాశాఖ ప్రత్యేకమైన స్టాంపును విడుదల చేసింది. 30,000 స్టాంపులు మాత్రమే తయారుచేశారు. ఈ స్టాంపును బంగారంతో తయారుచేశారు. ధర 112 డాలర్లు (దాదాపు 4,000 రూపాయలు). మొదటిరోజు కవరుమీద ఆమె భర్త ప్రెసిడెంట్ సుహార్తో సంతకం చోటుచేసుకుంది.

## ప్రాణమిత్రులు!

అయోధ్యకు చెందిన చెడ్డీలాల్, పక్కనున్న ఫైజాబాదుకు చెందిన మహమ్మద్ మాటిన్ – యాభై సంవత్సరాలుగా కలిసి మెలిసి తిరిగారు. మహమ్మద్ మాటిన్ అస్వస్థతకు లోనయ్యాడు. ఆ సంగతి అయోధ్యలో ఉన్న అతని మిత్రుడు చెడ్డీలాల్‌కు తెలిసింది. హుటాహుటిగా ఫైజాబాదు బయలు దేరాడు. అయితే ఆయన ఇల్లు చేరేసరికే మాటిన్ మరణించాడు. మిత్రుడి మృతదేహాన్ని చూసి దుఃఖం తట్టుకోలేక చెడ్డీలాల్ స్పృహతప్పి పడిపోయాడు. కొంతసేపటికి ప్రాణం పోయింది. ఏప్రిల్ 12వ తేదీ ఇద్దరు మిత్రులకూ ఒకేసారి విడివిడిగా అంత్యక్రియలు జరిగాయి. జంట నగరాల ప్రజలు ఈ ప్రాణమిత్రుల ఉదంతాన్ని హిందూ–ముస్లిం మైత్రికి ఉదాహరణగా చెప్పుకుంటున్నారు!

చందమామ
అనుబంధం
103



మనదేశపు
అందచందాలు

# భూతలస్వర్గం–నీలగిరి

దక్షిణ భారతదేశంలోని పడమటి కనుమలలో నీలగిరి కొండలు విస్తరించి ఉన్నాయి. ఈ కొండల చుట్టుపక్కల వున్న పచ్చిక బయళ్ళలో దాదాపు ముప్ఫై రకాల అడవిపూలు కోకొల్లలుగా పూస్తాయి. నీలగిరి టాహర్ అనే అడవి మేకలకు నీలగిరులు నివాస స్థానంగా ఉంటున్నాయి. ఈజాతి అడవిమేకలు ప్రస్తుతం దాదాపు వెయ్యి మాత్రమే ఉన్నాయి.



పన్నెండేళ్ళ కొకసారి పూచే 'కురింజి' పుష్పాలు కొండపార్శ్వాలను నీలంరంగుతో కప్పేస్తూ,వింత శోభను కలిగిస్తాయి. కణుజులు, చిరుతపులులు, గౌర్లు అడవుల లోపల నివసిస్తున్నాయి. ఈ అడవులలో రకరకాల 'బాల్సమ్' జాతి చెట్లు ఉన్నాయి. వీటి కొమ్మలు నాచుతో కప్పబడి ఉంటాయి. ఇక్కడ చిత్ర విచిత్రమైన రంగులతో రకరకాల పువ్వులు పూస్తాయి. నీలగిరి కొండల ప్రకృతిఅందాలు చూపరులను ఆనందాశ్చర్యాలతో ముంచెత్తుతాయి. అందుకే నీలగిరిని కొందరు భూమిపై వెలసిన స్వర్గశకలం అని వర్ణిస్తూ ఉంటారు!



పురాణకాలంనాటి రాజులు :

# సూర్యవంశ మూలపురుషుడు: ఇక్ష్వాకు

భారతీయ నాగరికత అభివృద్ధికీ, సంస్కృతీ వికాసానికీ కృషిచేసిన వారిలో ఋషులూ, రాజులూ, ముఖ్యులని చెప్పవచ్చు. వసిష్ఠుడు, విశ్వామిత్రుడు మొదలుగా గల ఋషులను గురించీ; శ్రీరాముడు, జనకుడు మొదలైన రాజులను గురించీ ప్రతి భారతీయుడికీ ఎంతో కొంత తెలిసి ఉంటుంది.

విశ్వామిత్రుడు రాజ్యసింహాసనాన్ని పరిత్యజించి ఋషి అయినవాడు. జనకుడు రాజుగా ఉంటూనే, మానసికంగా ఋషిలాగా జీవితం సాగించినవాడు. మన రాజులు పలువురు సాహసవీరులుగా, పరిపాలనాదక్షులుగా, త్యాగమూర్తులుగా, జాతి నిర్మాతలుగా పేరుగాంచారు. ఆదర్శ మూర్తులయిన రాజులలో అగ్రగణ్యుడు శ్రీరామచంద్రుడు. ఆదర్శవంతమైన ఆయన పరిపాలన రామరాజ్యంగా తరతరాల ప్రజల మన్ననలనందుకున్నది.

శ్రీరాముడు ఇక్ష్వాకుకుల తిలకుడుగా పేరుగాంచాడు. ఆయన సూర్యవంశానికి చెందిన వాడు. సూర్యవంశానికి మూలపురుషుడు ఇక్ష్వాకు. ఇక్ష్వాకు తండ్రి వైవస్వతమనువు. తల్లి శ్రద్ధాదేవి. వైవస్వతుడు అంటే సూర్యభగవానుడి కుమారుడు అని అర్థం.

ఇక్ష్వాకును గురించి అంతగా తెలియదు. అయినా – హరిశ్చంద్రుడు, సగరుడు, భగీరథుడు మొదలుగా గల ప్రసిద్ధులైన రాజులు జన్మించిన సూర్యవంశానికి మూలపురుషుడు కావడం వల్ల ఆయన పేరు చిరస్థాయిగా నిలిచి ఉన్నది!



## మీకు తెలుసా?

# ఇన్కాలు

పెరూలో రెడ్ఇండియన్ సంతతికి చెందిన ఇన్కాలు నివసించే వారు. వారు



ఎక్కువగా రాజధాని కూజో పరిసర ప్రాంతాలలో ఉండే వారు. ఇన్కా సమాజం సంపన్నమైన పాలకవర్గం నుంచి బానిసల వరకు పలు వర్గాలుగా విభజింపబడి ఉండేది. 'వీరకోచ' అనే దేవుణ్ణి పూజించేవారు. ఇన్కా కళాకారులు కళాత్మకమైన వస్తువులు తయారుచేయడంలో సిద్ధహస్తులు. వాళ్ళు సృష్టించిన వస్తువులు కొన్ని ఇంకా నిలిచి ఉన్నాయి. మొక్కజొన్నలు, బంగాళాదుంపలు మరికొన్ని కూరగాయలు పండించే వారు. అదే వారి ప్రధాన ఆహారం.

ఇల్మా అనే జంతువును పెంచేవారు. అనుదిన జీవితంలో ఈ జంతువు చాలా ముఖ్యమైనదిగా ఉండేది.

## ఇంద్రధనుస్సు





# మంచుమనిషి

'ఎస్కిమో' అంటే పచ్చిమాంసం తినేవాడు అని అర్థం! ఎస్కిమోలు సీల్ మాంసం తింటారు. సీల్ చర్మాన్ని గుడారాలకూ, బట్టలకూ ఉపయోగిస్తారు. 'కాయాక్' అనే వీరి పడవలు చాలా ప్రసిద్ధమైనవి. 'కాయాక్'లో కూర్చున్న మంచుమనిషి సీల్ చర్మం కోటు ధరిస్తాడు. నేలపై కుక్కలు లాగే చిన్న చిన్న 'స్లెడ్జిస్' మీద ఎస్కిమోలు ప్రయాణం చేస్తారు. చిన్న చిన్న ఇళ్ళను 'ఇగ్లూ' అని అంటారు. ప్రతి జంతువులోనూ, ప్రకృతిసహజమైన ప్రతి వస్తువులోనూ ఆత్మలు ఉంటాయని ఎస్కిమోల విశ్వాసం. మంచు ప్రదేశాలలో నివసించే ఎస్కిమో కుటుంబాన్ని చూడడం, ఆ కుటుంబంతో గడపడం వింత అనుభూతిని కలిగిస్తుంది!



# అదృష్టదురదృష్టాలు

పూర్వకాలంలో, నాస్తికుడైన ఒక రాజుండే వాడు. అతడు స్వశక్తినే తప్ప ఇంకే శక్తినీ నమ్మేవాడుకాడు. అతడి నమ్మకాలు ఎలా వున్నప్పటికీ, పరిపాలన చక్కగా వుండడం చేత, ప్రజలు సుఖంగా జీవిస్తూండేవారు. రాజు ఏడాదిలో ఒక నెలపాటు, మారు వేషంలో ఒంటరిగా రాజ్యమంతా తిరుగుతూ, ప్రజలకు తన పట్ల ఎటువంటి అభిప్రాయం వున్నదీ, వారి కష్టసుఖాలు ఏమిటన్నదీ గమనిస్తూండేవాడు.

ఒకసారి రాజు తన అలవాటు ప్రకారం, మారువేషంలో ఒక పొలం పక్కగా పోతూ, దాహంవేసి గుర్రం దిగి సమీపానవున్న ఒక బావిదగ్గర దాహం తీర్చుకుని, తీరుబాటుగా చుట్టూరా కలయజూశాడు. అలాచూడటంతో బావికి కాస్త ఎగువున వున్న పెద్ద మర్రి చెట్టుకింద విచారంగా కూచుని వున్న ఒక పేదవాడు అతడి కంటబడ్డాడు.

రాజు వెంటనే పేదవాడిదగ్గరకు పోయి, "ఏం, పెద్దయ్యా! అలా కూచున్నావేం?ఏమిటి బాధ?" అంటూ పలకరించి తనూ పక్కనే చతికిలబడ్డాడు.

పేదవాడు విచారంగా, "ఏమని చెప్పేది బాబూ, ఊహవచ్చిన దగ్గర్నించీ కష్టాలే గాని సుఖం అన్నది ఎరగను గదా!" అన్నాడు.

"ఏం, బతుకుతెరువుకు ఎక్కడా పనిదొరకటం లేదాఏం?" అంటూ రాజు ఆరాతీశాడు.

"వేరెక్కడో, పనెందుకు బాబూ, అదిగో ఆ కనబడే మూడు తాటిచెట్లదాకా వున్న పొలమంతా నాదే! ఆ దయామయుడి కటాక్షమే లేకుండా పోయింది, అంతే!" అంటూ భగవంతుణ్ణి తలుచుకుని చేతులెత్తి దణ్ణం పెట్టాడు పేదవాడు.

రాజుకు వెంటనే పేదవాడి మీద సర్రున కోపం వచ్చింది. అయినా, మూర్ఖుడు అనుకుని, తన కోపాన్ని అదుపుచేసుకుంటూ,

లక్ష్మీగాయత్రి

"ఒళ్ళొంచి పనిచేస్తే సుఖపడటానికి జానెడు పొలంచెక్క చాలునే!" అన్నాడు.

పేదవాడు ఆమాటకు నొచ్చుకుని, "బద్ధకమన్నది ఏ కోశానా ఎరగను, బాబూ! గత మూడేళ్ళబట్టీ ఏం జరుగుతున్నదో వింటే మీకే తెలుస్తుంది, వినండి!" అని, "మొదటేడు వరి వేశాను, విరగపండింది. ఈ ఏడు నా అదృష్టం బావుందిలే అనుకుని పంటంతా బస్తాలకెత్తి ఇల్లు చేర్చాను. ఇల్లంటే లంకంత కొంపనుకునేరు, రెల్లుగడ్డి కప్పిన మట్టిగోడల ఇల్లుమాది! సరే, పంట బాగా పండిందికదా అన్న ఆనందంలో, గారెలు చెయ్యమని నా పెళ్ళానికి చెప్పి, నేను శెట్టి దగ్గరకు బయల్దేరాను. తర్వాత తిరిగొచ్చిచూస్తే, మా ఇల్లంతా అంతెత్తున వున్న మంటల మధ్య తగలబడిపోతున్నది. జరిగినదేమంటే పొయ్యిమీద నూనె మూకుడు పెట్టి, నా పెళ్ళాం ఎందుకో ఇవతలకు వచ్చిందట. ఈ లోగా, అప్పటికే కాట్లాడుకుంటున్న నా కొడుకుల్లో ఒకడు, పొయ్యిలోంచి మండుతున్న కట్టెతీసి, 'వాత పెడతా జాగ్రత్త!' అంటూ రెండోవాణ్ణి బెదిరించాడు. ఆసరికి గుమ్మంలోకి వచ్చిన నా పెళ్ళాం అదిచూసి, 'బుద్ధి లేనివాడా, నిప్పుతో ఆటలేమిట్రా, అంటూ కేకలేస్తూ వాడిమీదికి పోబోయింది. దాంతో బెదిరి వాడు ఆకట్టెను కాస్తా చూరు మీదికి విసిరేశాడు. జరిగిందేమిటో నా పెళ్ళాం గ్రహించేసరికే రెల్లుగడ్డి భగ్గున అంటుకున్నది. నా పెళ్ళాం, పిల్లలూ కేకలు పెడుతూ బయటికి పరుగెత్తుకుపోయి, నలుగుర్నీ చేర్చే వేళకే మంటలు అంతెత్తున లేచాయి. ఆ సరికే నేనూ అక్కడికి చేరుకున్నాను. నలుగురం కలిసి ప్రాణా



లకు తెగిస్తే, ఐదుబస్తాల ధాన్యం మటుకు దక్కింది. దురదృష్టంకొద్దీ ఏర్పడిన ఆ మంటలలో మిగతా తిండి గింజలతో పాటు, మాకున్న కొద్దో గొప్పో కూడా నాశనమైపోయింది," అంటూ క్షణం ఆగాడు.

ఆసక్తిగా వింటున్న రాజు, "దీనికంతకూ కారణం నీ పెళ్లాం అజాగ్రత్తే! ఆకతాయి పిల్లల్ని ఒంటరిగా ఇంట్లో వదిలి క్షణమైనా బయటకు వెళ్ళటం ఎంతైనా ప్రమాదం. పిల్లలకు ఒద్దిక మప్పకపోవటం కూడా ఒక తప్పే! ఊఁ, సరే, తర్వాత?" అంటూ ప్రశ్నించాడు.

పేదవాడు, రాజు మాటలకు అనుమానంగా చూసి, తిరిగి ప్రారంభించాడు: "మరుసటేడు మళ్ళీ వరివేసి, గట్లమ్మట పిల్లి పెసర కూడా వేసి ఇంటిల్లిపాదిమీ ఒళ్ళెరక్కుండా



కష్టపడ్డాం. ఆ ఏడుకూడా పంట విరగపండింది. క్రిందటేడులాజరక్కుండా వుండాలని, నాపెళ్ళాం పోలేరమ్మకు మొక్కులు మొక్కింది. ఎందుకైనా మంచిదని వడ్ల బస్తాలను కొన్నాళ్ళపాటు దాచుకుంటానని శెట్టిగారి నడిగి, వాళ్ళ గాదెనొకదాన్ని సిద్ధం చేసుకున్నాను. అందరం కోతలు కోశాం. పంట నూర్పిళ్ళు ప్రారంభమయ్యాయి. చిన్నా చితకా పంటగల వాళ్ళు తొందరగా నూర్పిడి చేసి బస్తాలకెత్తారు. మాది కాస్త ఎక్కువ వుండటంతో ఒకరోజు ఆలశ్యమైంది. తొలి విడతగా ఐదు బస్తాల ధాన్యం నూర్పిడిచేసి, శెట్టిగారి గాదెలో భద్రపరిచాను. తెల్లవారి మిగతా ధాన్యం పని చూద్దామనుకుంటూండగా, రాత్రికి రాత్రి కుండపోతగా వాన ప్రారంభమైంది.ఆ వాన వానల్లా ఏకధాటిగా మూడు రాత్రులూ, మూడు పగళ్ళూ పడింది. నాతో బాటుయింకా చాలామంది నష్టపోయారు!" అంటూ మళ్ళీ ఆగాడు.

"బావుంది! మొదట అగ్నిదేవుడు స్వాహా చేస్తే, తర్వాత వరుణదేవుడు భోంచేశాడన్న మాట.ఇదీ నీ తప్పేనంటాను! సాధారణంగా పంట నూర్పిళ్ళ సమయంలో చెదురుమదురుగా వర్షం పడుతూనే వుంటుంది. తొలి ఏడు దెబ్బతిన్నవాడివి కూడా గదా, కాస్త తొందరగా పని ముగించొద్దూ? నలుగురు కూలివాళ్ళనైనా పెట్టి త్వరపడి వుండాల్సింది," అన్నాడు రాజు.

ఆ మాటలు వింటూనే పేదవాడు చప్పున చేతులు జోడించి రాజుకు నమస్కరిస్తూ, "మహాప్రభో, తమరు మారువేషంలో వున్న మహారాజులు కారుగదా?" అంటూ ప్రశ్నించాడు.

రాజు ఆశ్చర్యంగా, "నీకా అనుమానం ఎందుకొచ్చింది?" అన్నాడు.

"నా కథ విన్నవాడెవడైనా సరే, 'అయ్యో నీది ఎంత దురదృష్టమయ్యా' అనో, 'ఏం చేస్తాం, నీ మొహాన అలా రాసిపెట్టి వున్నది, అంతే!' అనో అంటాడు. కాని, రెండుసార్లూ తమరు మా దురదృష్టాన్ని గాక, మాతప్పుల్నే ఎత్తి చూపించారు! తమరు మా ఏలినవారేమో అని అనుమానించటానికి ఇంతకంటే ఋజువేంకావాలి?" అన్నాడు పేదవాడు.

రాజు, వాడివైపు కాస్తమెచ్చుకోలుగాచూసి, "ఫరవాలేదు,నీ బుర్రకు కాస్తంత తార్కిక జ్ఞానం కూడా వున్నది. నేనెవరైతేనేంగాని, మూడోసారి కూడా ఏమైందో ముందుచెప్పు!" అన్నాడు.

పేదవాడు కాస్త నిర్లిప్తంగా రాజు వైపు చూసి, "మూడోసారి నా దురదృష్టమే నన్ను భోంచేసింది, స్వామీ! మొదటి సంవత్సరం ఇల్లు తిరిగికట్టుకోవటానికీ, రెండో సంవత్సరం ఇల్లు గడవటానికీ శెట్టిగారి దగ్గర అప్పులు చేశాను. మూడో సంవత్సరం –అంటే నిరుడు, పంటకూడా ఒక మాదిరిగానే దిగుబడి వచ్చింది. కోతల సమయానికి నాకు అప్పిచ్చిన ధర్మాత్ముణ్ణి కాస్తా, ఆ యమధర్మరాజు పిలుచుకుపోయాడు. ఇక ఆయన కొడుకు సాక్షాత్తూ యమధర్మరాజే! నూర్పిళ్ళు జరుగుతుండగా వచ్చి, మొత్తం బాకీకిగానూ వడ్లు కొలుస్తావా లేదా అని కూచున్నాడు. కాస్త కాస్తగా తీరుస్తాను మహాప్రభో, అని నేనెంత మొత్తుకుంటున్నా వినక, మాకు బొటాబొటిగా తిండిగింజలు వదిలి, మిగతాదంతా కొలుచుకుపోయాడు. అయినా నా బాకీ మొత్తం చెల్లుబాటు కాలేదట. అంచేత నా పొలాన్ని కూడా ఆమహానుభావుడే స్వాధీనం చేసుకుని, నన్నే కమతం చేసి తిండిగింజలు మాత్రం కొలుచుకోమని దయతలిచాడు! ఈ ఏడంతా రెక్కలు ముక్కలయ్యేలా కష్టపడ్డాను. అదుగో, ఆ పైరు చూడండి, ఎంతపచ్చగా కళకళ్ళాడుతున్నదో. కోతల సమయానికి శెట్టికొడుకు గద్దల్లే వచ్చి వాలి, నా కష్టఫలాన్నంతటినీ ముక్కున కరుచుకుని, నా నోట ఇంత దుమ్ము గొట్టి పోతాడు. పోనీ, గ్రామాధికారికి ఫిర్యాదు చేతామా అంటే, ఆయన ఈ శెట్టి కొడుక్కి సాక్షాత్తూ పిల్లనిచ్చిన మామ! ఇక నా గోడు చెప్పుకోటానికి, ఆ సర్వేశ్వరుడు తప్ప ఇంకెవరున్నారో మీరేచెప్పండి?" అంటూ పెద్దగా నిట్టూర్చాడు.



పేదవాడి మాటలకు రాజు కోపం తెచ్చుకుని, "మూర్ఖుడా, అన్యాయం జరిగినప్పుడు చెయ్యవలసిందేదో చెయ్యకుండా సర్వేశ్వరుడా, దయామయుడా అంటూ పిచ్చికేకలు పెడుతూ కూచోబట్టే, నీ బతుకిలా అధ్వాన్నమైంది. గ్రామాధికారికాకుంటే, మండలాధికారి లేడా? మండలాధికారికూడా చేతగానివాజమ్మే అయినపక్షంలో, సాక్షాత్తూ ఈ దేశాన్నేలేరాజు లేడా? ఎవరో ఒకరికి ఫిర్యాదు చేసి న్యాయం జరిపించుకోవాలిగాని, ఇలా అరువు కేకలు పెట్టి ఏంలాభం?" అన్నాడు.

ఆ మాటలు వినీ వినగానే పేదవాడు మళ్ళీ చేతులెత్తి, రాజుకు నమస్కరిస్తూ, "మహాప్రభో, తమరు సాక్షాత్తూ మా రాజుగారే, సందేహం లేదు! ఇక నా సంగతంటారా? నన్ను ఆ దురదృష్ట దేవత పట్టిపీడుస్తున్నది.



అదృష్టవంతుణ్ణి చెడిపేవాడూ లేడు, దుర దృష్టవంతుణ్ణి బాగుచెయ్యగలిగే వాడూలేడ న్నది, నా గట్టినమ్మకం. అందుకే నేను ఎక్క డికీ పోకుండా, ఆ దేవాధిదేవుణ్ణే నమ్ముకు న్నాను," అన్నాడు.

తను రాజని గ్రహించి కూడా పేదవాడు తన ధోరణిని విడిచిపెట్టకపోవటం చూసి, రాజుకు మరింతకోపం వచ్చింది. అతడు వ్యంగ్యంగా, "అయితే మరింకేం, పొలంలో ఈ పాటి కష్టం కూడా చెయ్యటం దేనికి? ఇంట్లోమునగ తీసుకుని పడుకుంటే మాత్రం, నీ దేవుడు నీకు అన్ని ఏర్పాట్లూ చెయ్యక పోతాడా? నీ అదృష్టంనిన్ను అందలం ఎక్కిం చక పోతుందా?" అన్నాడు.

రాజుకు బాగా కోపం వచ్చిందని గ్రహించి కూడా పేదవాడు ఏమాత్రం జంకక, "గాలిలో దీపం పెట్టి, దేవుడా నీదే భారం అనే మెట్ట వేదాంతాన్ని నేను చెప్పటం లేదు, ప్రభో! మన ధర్మంగా మనం దీపం చుట్టూ రక్షణగా చేతులు పెట్టాలి. ఆ పైన భగవంతుడిదయ. అదృష్టం బావుందా, దీపం నిలుస్తుంది,లేదా లేదు. కూటికి గతి లేని నాకైనా అదేసూత్రం. మహారాజులైన మీకైనా అదే సూత్రం!" అన్నాడు.

ఇక కోపం అణుచుకోవటం అసలు ఏమాత్రం సాధ్యం కాలేదు రాజుకు. అతడు మండిపడుతూ, "దౌర్భాగ్యుడా, ఇప్పుడు నేను మీ శెట్టి కొడుకును మందలించి, నీ పొలం నీకు తిరిగి ఇప్పిస్తే కూడా, నువ్వా దేవుణ్ణే కీర్తిస్తావు కాబోలు!" అన్నాడు.

పేదవాడు వినయంగా, "పొరబాటు,మహా ప్రభో! మిమ్మల్నీ, ఆ సర్వేశ్వరుణ్ణీ కూడా కీర్తిస్తాను. మంచి వాళ్ళు ఈ లోకంలో, ఆ భగవంతుడి దూతలు! నా బోటి దురదృష్ట వంతుల్ని ఆదుకొమ్మని, ఆ దేవుడు మీలాంటి మంచి మనసున్న వాళ్ళను పంపిస్తాడు. అంచేత ఇద్దరికీ నేను సర్వదా కృతజ్ఞుణ్ణే," అన్నాడు.

రాజుకు అక్కడికక్కడే ఆ పేదవాణ్ణి నిలువునా కొరతవేయించాలనిపించింది. అతికష్టం మీద అతడు తన ఆవేశాన్ని అణ చుకుంటూ, "సరే, ఇంతకూ నువ్వనేదేమిటి? అదృష్టవంతుణ్ణి చెడిపేవాడూ, దురదృష్ట వంతుణ్ణి బాగుచేసే వాడూ లేడని! ఉంటే గింటే ఆదేవుడొక్కడేనని. అంతేకదా?" అని ప్రశ్నించాడు.

పేదవాడు నమ్రతగా, "నానమ్మకం అదే, ప్రభో! రాకాసిదీవిలో నన్ను తీసికెళ్ళి పారేసినా

సరే, నాకు అదృష్టంపట్టవచ్చు. నన్ను మీసర సనకూచోబెట్టుకుని రాజధానికి తీసుకువెళ్ళి నా, నా దురదృష్టం నన్ను వదలకపోవచ్చు," అన్నాడు.

మూర్ఖుడైన ఆ పేదవాడికి ఎలాబుద్ధి చెప్పాలా అని ఆలోచిస్తున్న రాజుకు, పేదవాడి మాటలు వినగానే ఒక ఆలోచన వచ్చింది.

అతడు ఆనందంతో చిన్నగా చప్పట్లు చరిచి, "ఒరే, మూర్ఖుడా! నువ్వు చెప్పినట్టే నేను, నిన్ను రాకాసిదీవికి పంపబోతున్నాను. ఆరునెలలకు సరిపడే ఆహారపదార్థాలు కూడా ఇస్తాను. ఆరు నెలలపాటు ఒంటరిగా రాకాసి దీవిలో బతుకుతూ, అదృష్టంకోసం నీ దయామయుణ్ణి ప్రార్థించు! లే, తక్షణం బైలుదేరు నాతో," అంటూ లేచాడు.

రాజు మాటలకు పేదవాడు క్షణకాలం నిర్ఘాంతపోయాడు.

ఆ దేశానికి ఉత్తరపు ఎల్లగా, ఉత్తుంగ తరంగాలతో ఘోషించే సముద్రం వుంది. ఆ సముద్రతీరం నిత్యం వచ్చేపోయే వ్యాపార నౌకలతో ఎంతో సందడిగా వుంటుంది. సముద్ర వ్యాపారం చేసే వర్తకులు కూడా ఆ దేశంలో చాలామంది వున్నారు. వారి పుణ్యమా అని, సముద్ర మధ్యంలో వున్న రాకాసిదీవి గురించి దేశంలో పసిపిల్లలు మొదలు వృద్ధులదాకా అందరికీ తెలిసింది.

సముద్ర మధ్య భాగంలోంచి పయనిస్తున్న నౌకలలోని నావికులకు, ఆ ప్రాంతాలపచ్చటి చెట్లతో కళకళ్ళాడుతూ ఎంతో రమణీయంగా వుండే దీవికనిపిస్తుంది. చాలాకాలం క్రితం అంటే ఆ దీవి గురించి తెలియని రోజుల్లో వ్యాపారస్థులు అక్కడ ఆగేవారు. అలాఆగిన



వాళ్ళలో ఇద్దరు, ముగ్గురైనా తప్పించుకుని తిరిగి నౌక చేరటం దాదాపు అసంభవ మయ్యేది. మిగిలిన వాళ్ళంతా ఆ దీవిలో వున్న ఒకవింతరాక్షసుడికి ఆహారమై పోయే వారు.

ఆ రాక్షసుడు దాదాపు తాటి చెట్టంత పొడవు వుంటాడనీ, ఐదారడుగుల పొడవున్న చేతులు చాపి, ఒకేసారి నలుగురైదుగురు మనుషులను పట్టుకుంటాడనీ చెప్పుకునే వారు. వాడినుంచి తప్పించుకుని తిరిగి స్వదేశం చేరిన వాళ్ళందరూ, మిగతా వ్యాపారుల క్షేమంకోరి, ఆ రాక్షసుడి గురించి బహుళ ప్రచారం చేశారు. ఆ కారణంగా అది రాకాసిదీవి అయింది. గత ఎన్నోసంవత్స రాలుగా, ఆ దీవి మీద కాలు మోపుదామని అనుకున్నవాడు లేడు!

ఇప్పుడా దీవికే రాజు, తనను పంపద లుచుకున్నాడని వినగానే పేదవాడికి ఒళ్ళు చల్లబడింది. వాడు వణుకుతున్న స్వరంతో, "మహా ప్రభో! ఏదో మాటవరసకు నోరుజారిన పాపానికి, నా మీద పిసరంతైనా కనికరం లేకుండా అంతటి శిక్ష విధించటం తమకు తగునా?" అన్నాడు.

పేదవాడి భయం, రాజుకు ఆనందాన్ని కలిగించింది. అతడు నవ్వుతూ, "ఈ శిక్ష నుంచి తప్పించుకోవటం నీ చేతుల్లో వున్న పనే! నువ్వు ఇంతదాకా మాట్లాడిన మాటలన్నీ శుద్ధతప్పులని ఒప్పుకుంటివా, ఈ క్షణానే నీ పొలం నీదవుతుంది! నీకంటూ అసలు బాకీలే ఏమీవుండకపోగా, మరికొంతపొలమూ డబ్బూ, బంగారమూ కూడా దొరుకుతాయి," అన్నాడు.

పేదవాడు క్షణకాలం ఆలోచించాడు. అతడికి తను నమ్ముకున్న దైవం గుర్తొచ్చాడు. పుట్టిన దగ్గర నుంచీ పెద్దలు నూరిపొయ్యగా పొయ్యగా, తన రక్తంలో జీర్ణించుకు పోయిన నమ్మకాలూ, విశ్వాసాలూ గుర్తొచ్చాయి. వాటి నన్నిటినీ గాలికి వదిలేసి బాగుపడటం కంటే నీచమైనది మరేదీ వుండదనిపించింది.

తక్షణం వాడు దృఢంగా, "ప్రభో, నాకు రాకాసిదీవిలో చావాలనే రాసిపెట్టివుంటే, దాన్ని తప్పించటం ఎవరివల్లా కాదు. మీ మాట ప్రకారమే నన్నక్కడికి పంపించెయ్యండి. ఆపైన ఆ భగవంతుడే వున్నాడు. నా భార్యా బిడ్డల జీవితాలంటారా, మీదయ, వాళ్ళ ప్రాప్తం!" అంటూ చేతులెత్తి రాజుకు నమస్క రించాడు.

ఆ మాటలు వినగానే, అంతవరకూ రాజు మనసులో ఏ మూలో పేదవాడి పట్ల వున్న కాస్తోకూస్తో జాలికూడా ఎగిరిపోయి, రాజుకు పంతం హెచ్చింది. అతడు తక్షణం పేదవాడి ద్వారానే గ్రామాధికారికి కబురు పంపి, పేదవాడికుటుంబం మొత్తాన్ని తనతో బాటు రాజధానికితీసుకుపోయేందుకు కావ లసిన ఏర్పాట్లు చేయించాడు. అసలు సంగతి ఎవరికీ తెలియనందున, అందరూ పేదవాడికి అదృష్టం కలిసివచ్చిందని ఈర్ష్య పడ్డారు.

రాజధాని చేరుతూనే రాజు పేదవాడి భార్యాబిడ్డలకు వసతి ఏర్పాట్లన్నీ చేసి, పేద వాడి ప్రయాణానికి కావలసిన ఏర్పాట్లు కూడా రహస్యంగా చేశాడు. -(ఇంకావుంది)





# వీరరాజకుమారుడు

ధవళపుర మహారాజు ఆకస్మికంగా చనిపోయే సరికి మహారాజు తమ్ముడైన వీరసింహుడు రాజు అయ్యాడు. అయితే, చనిపోయిన మహారాజుకు సూర్యసింహుడనే పన్నెండేళ్ళ కుమారుడు ఉన్నాడు. ఆ సూర్యసింహుణ్ణి చంపించినట్టయితే తానే రాజుగా ఉండిపో వచ్చునన్న దుర్బుద్ధి వీరసింహుడికి కలిగింది.

ఈ సంగతి పసిగట్టి మంత్రి రాజకుమారుడి ప్రాణాలు కాపాడటానికి పూనుకున్నాడు. ఆయన రాజకుమారుణ్ణి రహస్యంగా తన వెంట తీసుకుని, రాజ్యసరిహద్దుల్లో వున్న కృష్ణగడానికి బయలుదేరాడు. ఆ దేశానికి అతని పినతల్లే రాణి.

వారు అంజనపుర మనే గ్రామాన్ని చేరే సరికి సాయంకాలమయింది. ఆ గ్రామంలోని ధనికుడైన ఒక రైతు మంత్రికీ, రాజకుమారుడికీ ఆతిథ్యం ఇచ్చాడు. రాజకుమారుణ్ణి రైతుఇంట ప్రతి ఒక్కరూ వింతగా చూశారు. దానికి కారణమేమిటో మంత్రికి మొదట అర్థం కాలేదు. రైతు కొడుకు మూడుమూర్తులా రాజకుమార్ణి పోలి ఉంటాడు! ఆ కుర్రవాడి పేరు బలరాముడు. బలరాముణ్ణి చూడగానే మంత్రి కూడా అమితంగా ఆశ్చర్యపడ్డాడు. ముఖంలోనూ, ఆకారంలోనూ, ఎత్తులోనూ, చివరకు నడకలో సైతం రాజకుమారుడికీ, బలరాముడికీ ఎంతో పోలిక ఉన్నది. ఇద్దరూ కవలపిల్లల లాగున్నారు.

బలరాముణ్ణి తన వెంట ఉంచుకుంటే ఉపయోగం ఉండవచ్చునని పించి మంత్రి రైతుతో, "నీ కొడుకును రాజకుమారుడి చెలికాడుగా పంపినట్టయితే వాడికి ముందు ముందు ఎంతోమేలు కలగవచ్చు. నేనునీకు పుష్కలంగా ధనం కూడా ఇస్తాను," అన్నాడు.

రైతుఅందుకుసంతోషంగా ఒప్పుకున్నాడు.

మంత్రి రాజకుమారుడితో బాటు రైతు కుమారుణ్ణి కూడా వెంటబెట్టుకుని నాలుగు

25-ఏళ్ళనాటి చందమామ కథ



రోజులు ప్రయాణం చేసి, కృష్ణగడం చేరాడు. ఈ ప్రయాణంలో రాజకుమారుడికీ, రైతుకొడుకైన బలరాముడికీ గాఢమైన మైత్రి ఏర్పడింది.

కృష్ణగడం మహారాణి అతిథులకు చక్కని ఏర్పాట్లు చేసింది. రోజులు గడుస్తున్న కొద్దీ రాజకుమారుడికీ, రైతుకుమారుడికీ మధ్య మైత్రి కూడా అభివృద్ధి అయింది.

ఇలా కొంతకాలం గడిచాక వీరసింహుడికి రాజకుమారుడు కృష్ణగడంలో ఉన్నవార్తతెలిసి, పెద్ద సైన్యంతో వచ్చి కృష్ణగడాన్ని ముట్టడించాడు.

తన మూలంగా తన పినతల్లికి ప్రమాదం రావటం ఎంతమాత్రమూ ఇష్టంలేక ధవళపుర మంత్రి తెల్లజెండాఎత్తి వీరసింహుడితో సంధి చేసుకోవటానికి బయలుదేరాడు. రాజకుమారుణ్ణి తన వశం చేసినట్టయితే వీరసింహుడు ముట్టడిఎత్తితిరిగిపోతానన్నాడు. మంత్రికి పచ్చి వెలక్కాయ గొంతులో పడ్డట్టయింది. తాను రాజకుమారుణ్ణి కాపాడటానికి చేసిన ప్రయత్నమంతా వృధా అయిపోయింది.

అయితే రాజకుమారుణ్ణి కాపాడటానికి ఇంకాఒకమార్గంమిగిలిఉన్నది.అదేమిటంటే, రైతుకుమారుడైన బలరాముణ్ణి రాజకుమారుడనిచెప్పి వీరసింహుడికి అప్పగించటం.

మంత్రి బలరాముణ్ణి ఏకాంతంగా పిలిచి, "నాయనా, రాజకుమారుణ్ణి తనకు వశపరచమని శత్రురాజుకోరుతున్నాడు. అతను రాజకుమారుడి ప్రాణం తీసే అవకాశం కూడా ఉన్నది. రాజకుమారుడివి నువ్వేనని నిన్ను పంపగలను. శత్రురాజు తెలుసుకోలేడు.కాని అలా చేస్తే నీ ప్రాణానికీ ప్రమాదం కలగవచ్చు. ఏమి చెయ్యటానికీ నాకు పాలుపోకుండా ఉన్నది," అన్నాడు.

ఈమాటలువినగానే బలరాముడు, "బాబుగారూ, నాప్రాణం పోయినందువల్ల కలిగేనష్టం లేదు. కాని రాజకుమారుడు నాలుగు కాలాల పాటు బతికి ఉంటే రాజ్యం తిరిగి సంపాదించుకోగలుగుతాడు. రాజవంశం నిలుస్తుంది. శత్రురాజుదగ్గరికి నన్నుపంపండి. ఈ సంగతి రాజకుమారుడికి మాత్రం తెలియనివ్వకండి," అన్నాడు.

మంత్రి ఈ మాటకు ఎంతో సంతోషించి, బలరాముడికి రాజలాంఛనాలన్నీ తగిలించి, భటులవెంట, కృష్ణగడం కోట వెలుపల సైన్యంతో విడిసి ఉన్న వీరసింహుడి డేరాకు పంపాడు.

బలరాముడు బయలుదేరిన కొద్దిసేపటికి రాజకుమారుడు అతని కోసం వెతకసాగాడు.

అతన్ని భటులు కోట దాటించి తీసుకుపోయా రని తెలిసింది. కోట బయట తన పినతండ్రి ముట్టడి వేసి ఉన్నాడనీ, అతను తనప్రాణం తీయటానికి తహతహలాడుతున్నాడనీ, బల రాముణ్ణి చూసి ఎవరైనా తానే అని భ్రమ పడవచ్చుననీ అతనికి తెలుసును. అతనుఒక భటుడి చేత ఉన్న కత్తిలాక్కుని అతివేగంగా కోట బయటికి పరిగెత్తాడు.

బలరాముడు వీరసింహుడి గుడారం ప్రవేశించగానే వీరసింహుడి భటులు అతన్ని రాజకుమారుడిగా గుర్తించి, "చినరాజుగారే!" అని ఆనందంతోకేకలుపెట్టారు. వీరసింహుడు వారిని బయటికి పంపేసి, బలరాముడితో, "ఇంత కాలానికి నాకు దొరికావు. నాకూ, సింహాసనానికీ మధ్య అడ్డంగా వున్న నిన్ను ఈ క్షణమే చంపేసి, నా దారి నిష్కంటకం చేసుకుంటాను," అంటూ కత్తి దూశాడు.

బలరాముడు చలించలేదు. "నన్ను చంపి నువ్వుబాగుపడవు. ఉన్న సింహాసనాన్ని కూడా పోగొట్టుకుంటావు," అన్నాడా కుర్రవాడు. వీరసింహుడు బలరాముడి పైకి వచ్చాడు. బల రాముడు అతనికి అందకుండా పరిగెత్త సాగాడు. ఇంతలో "ఆగు!" అని గుడారం ద్వారం వద్ద నిలబడి రాజకుమారుడు కేక పెట్టాడు. వీరసింహుడు అటుచూసి నిర్ఘాంత పోయాడు. ఇద్దరు రాజకుమారులు తన గుడారంలోకి ఎలా వచ్చారో అతనికి అర్థం కాలేదు. అమితమైన దిగ్భ్రమలో అతనిచేతి కత్తి కిందికి వాలిపోయింది. మరుక్షణం రాజ కుమారుడు వీరసింహుడి మీదికి లంఘించి, ఒక్కదెబ్బతో అతని తల నరికేశాడు.

వీరసింహుడు చచ్చాడనగానే అతని వెంట వచ్చిన సైనికులందరూ మూగారు. తమ కాబోయే రాజే వీరసింహుణ్ణి హత్యచేశాడనీ, వీరసింహుడు తమ రాజకుమారుణ్ణి హత్య చేయబోవటం చేత అలా జరిగిందనీ తెలియ గానే సైనికులు ఎంతగానో సంతోషించారు.

తరవాత రాజకుమారుడు మంత్రితోనూ, బలరాముడితోనూ తన దేశానికి తిరిగి పోయాడు. వెంటనే రాజకుమారుడికి పట్టాభి షేకంజరిగింది. రాజప్రతినిధిగా మంత్రి కొంత కాలం రాజ్యం చేసి, రాజకుమారుడు యుక్త వయస్కుడుకాగానే రాజ్యభారం అతనికి అప్ప గించాడు.బలరాముడు అనేక మాన్యాలకు అధిపతిఅయి,రాజకుమారుడికి ముఖ్య అంత రంగికుడుగాఉంటూయావజ్జీవస్నేహంచేశాడు.



# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు **1997** జూలై నెల సంచికలో ప్రకటింపబడును.



MAHANTESH C. MORABAD



MAHANTESH C. MORABAD

* పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) * మే నెల15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. * మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం.* వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:
చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, చెన్నయ్ - 600 026

## మార్చినెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ముచ్చటైన జోడు!
రెండవ ఫోటో : ఫోటోతీస్తా చూడు!!
పంపినవారు : బి.వి.ఎల్. సరోజ
స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా
గుడివాడ – **524003**
కృష్ణాజిల్లా (ఆం.ప్ర)




Printed by B.V. REDDI at Prasad Process private Ltd., 188, N.S.K. Salai, Madras - 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras - 600 026 (India), Controlling Editor: NAGI REDDI.